# శ్రీనాథుని కవితా వైభవం

కవిసార్వభౌముని
కమనీయపద్యాలకు
రమణీయ వ్యాఖ్య

వ్యాఖ్యాత :

డా. జి.వి. సుబ్రహ్మణ్యం



ప్రచురణ




యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**SRINATHUNI KAVITHA VAIBHAVAM**
SELECTIONS FROM KAVISARVABHOWMA'S
POETIC WORKS WITH A COMMENTARY
**By Dr. G. V. Subrahmanyam**


**యువభారతి**

ప్రచురణ : 24
ప్రథమ ముద్రణ : 5,200
6 అక్టోబర్, 1974

ముఖపత్ర రచన :
**శీలా వీర్రాజు**

ముద్రణ :
**నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు**

ముఖచిత్ర ముద్రణ :
**విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు**

ప్రతులకు :
**యువభారతి**
5, కింగ్స్‌వే, సికిందరాబాదు–500003

లేదా

**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు–500001

వెల : రు. 2-00



# మా మాట

సమన్వయ దృక్పథం ప్రజాస్వామ్య పరిరక్షణకు తోడ్పడుతుంది. ఉత్తమ సాహిత్యాధ్యయనం సమన్వయ సాధనకు తొలిమెట్టు. బహుజన హితం కోసం, బహుజన సుఖంకోసం మనిషి ప్రతిభ వ్యక్తం కావాలి. మనిషిలో స్వతస్సిద్ధంగా, అంతర్నిహితంగా ఉన్న మానవత్వాన్ని జాగరితం చేయగలిగే శక్తి సాహిత్యానికే ఉన్నదన్న నమ్మకంతో, ఉత్తమసాహిత్యాధ్యయనానికి అనువైన పుస్తకప్రచురణ, సాహిత్య సమావేశాలు, గోష్ఠులు నిర్వహిస్తూ యువభారతి కడచిన పదేళ్లుగా తెలుగు ప్రజల సంస్కృతి వికాసానికి యథోచితంగా కృషిచేస్తున్నది.

ప్రాచీన, అర్వాచీన సాహిత్యాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను సునిశితంగా సమవేదనా దృక్కోణంతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి 'సాహితీవాహిని' పరంపరను ప్రచురిస్తున్నది. ఈ పరంపరలో ఇంతవరకూ వెలువడినవి కేవలం సాహిత్యాధ్యయనాకి సంబంధించినవే. ఇక ముందు ముందు కౌటుంబిక, సాంఘిక, వైజ్ఞానిక విషయాలకు సంబంధించిన పుస్తకాలను కూడ ప్రచురించి పఠితృలోకానికి అందజేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాము.

సాహితీవాహిని పరంపరలో ఆరవ తరంగంగా "శ్రీనాథుని కవితావైభవా"న్ని అందిస్తున్నాము. శ్రీనాథుని సాహిత్య, వ్యక్తిత్వాలతో పరిచయం కలిగించే పద్యాలను కొన్నింటిని ఏర్చికూర్చి అనువైన పద్ధతిలో వ్యాఖ్యానం వ్రాయించి వెలువరిస్తున్నాము. శ్రీనాథుని సాహిత్యం ఒక మహాసాగరం. తలస్పర్శిగా ఆయన సాహిత్యమంతటితో అభినివేశము సంపాదించుకోవడం అందరికీ సాధ్యంకాని పని. శ్రీనాథుని సాహిత్యమంతా గొప్పదే. చదువదగినదే. కాని అధ్యయనాభిలాషియైన ఒక తెలుగువాడికి "ఇదుగో ఇవి శ్రీనాథుని కొన్ని పద్యాలు. వీటితో పరిచయం లేకపోతే శ్రీనాథుని ప్రతిభతో పరిచయ మటుంచి, నీకు తెలుగువా డనిపించుకొనే యోగ్యతలేదు." అనే పద్ధతిలో కొన్ని పద్యాలను

ఏరి ఆ పద్యాలెందుకు మంచివో, ఎందుకు తెలుగువాడి జిహ్వాగ్రంపై లాస్య మాడాలో తెలిపే విధంగా వ్యాఖ్యానం వెలయించి అందిస్తున్నాం. ఇదేవిధంగా నిన్నటి నేటి మేటికవుల గ్రంథాలలోనుంచి మంచి పద్యాలను ఏరి అందించాలని అనుకుంటున్నాము. ఇంగ్లీషు, రష్యన్, ఫ్రెంచ్, జర్మన్ మున్నగు ప్రసిద్ధ భాషలలో ఇలాంటి ఏర్చికూర్చిన సంకలనాలు అనేకం వచ్చినవి. తెలుగులో అసలు రాలేదని కాదు-అంతగా అందుబాటులోకి రాలేదని మే మీ ప్రణాళికను సిద్ధం చేసినాము. పుస్తకాలు ప్రచురించి లాభాలు సంపాదించాలనే ఉద్దేశం యువభారతికి లేదు. ముద్రణవ్యయం నక్షత్రాలనందుకోవాలనే అమితాశతో ఆకాశాని కెగబ్రాకుతున్న ఈ రోజుల్లో సాధ్యమైనంత తక్కువ వెలకు సాధ్య మైనంత ఉత్తమ సాహిత్యాన్ని అందజేయాలనే ప్రయత్నంతో యువభారతి ఉద్యమిస్తున్నది.

మా యువభారతి ప్రచురణలకు ప్రధాన సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు. సాహిత్యంపట్ల ఎంత అభిమానమున్నదో అందులో అంతటి అభినివేశాన్ని సంపాదించుకొన్న విద్వాంసులు, కవులు, నాటకకర్తలు, సహృదయ విమర్శకులు, వాగ్మివతంసులు, ఉత్తమ అధ్యాపకులు. మా ప్రచురణలకు ఆయన సంపాదకత్వం వహించడం మా అదృష్టం. శ్రీనాథుని పద్యాలను ఏరి వాటిలోని కవితాపరిమళాలను, మానవతామర్యాదలను సువ్యక్తం చేయగలిగారు శ్రీ సుబ్రహ్మణ్యంగారు. యువభారతి ఆయన సాహిత్యాభిమానాన్ని, ఆయన ఔదార్యాన్ని ఎన్నడూ మరువలేదు. ఇంతటి ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలు కలిగివుండి, మాసంస్థ చేస్తున్న ఉడుతాభక్తి సేవలోని ఆంతర్యాన్ని, నైర్మల్యాన్ని సానుభూతితో అర్థంచేసుకొని మాకు చేదోడు వాదోడుగా ఉంటూ మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూత నిస్తున్న తపస్వులు, మనస్వులు శ్రీ సుబ్రహ్మణ్యంగారు. ఆయనకు మా హృదయపూర్వక అభివందనములు.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడంలోను యథోచితంగా తోడ్పడి, తమ శక్తియుక్తులను, ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తాము.

6—10—1974

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా, శక్తివంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ - ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయన శీలాన్నీ అల వరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ఇంతవరకూ ఇరవైమూడు ప్రచురణలు ప్రచురించి లక్షా అరవై వేలకు పైగా ప్రతులను తక్కువ వెలకు తెలుగు పాఠకుల కందజేయడం జరిగింది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే-యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో ఇప్పటికి 7,100 మంది సహృదయులు చేరారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభించబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 450 మంది, భారతీభూషణులుగా 45 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారిసౌహార్ద్రం, భాషాప్రియత్వం, ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలం, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి

6 - 10 - 1974

అధ్యక్షుడు

# కవిసార్వభౌముడు

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్త్వాగల్భ్యమూహించెదన్"

ఆంధ్ర సాహిత్య చరిత్రలో కవిత్రయం తరువాత కావ్య యుగకర్తగా నిలిచినవాడు శ్రీనాథుడు. వారు పురాణేతిహాసానువాదం నిర్వహింపగా ఈయన ప్రౌఢకావ్యానువాదాన్ని చేపట్టి తన ప్రత్యేకతను నిరూపించుకొన్నాడు. శ్రీనాథుని కావ్యాల కున్న ప్రశస్తి ఒకయెత్తు; ఆయన కవితాశైలి కున్న వైశిష్ట్యం మరొక యెత్తు. శబ్దార్థోభయ ప్రధానమైన రీతి మార్గానికి ఆయన ప్రవర్తకుడు. ఓజోమధురమైన శ్రీనాథుని వైదర్భీరీతి తెలుగుభారతి కొక ముగ్ధమోహన సౌందర్యాన్ని సంతరించింది; నూత్న యౌవ్వనాన్ని ప్రసాదించింది.

శ్రీనాథుడు క్రీ.శ. 1360 ప్రాంతంలో పాకనాడులోని కాల్పట్టణంలో జన్మించాడు. పుట్టింది కవిపండితవంశంలో. తాత కమలనాభామాత్యుడు సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి, పద్మపురాణసంగ్రహకర్త. తండ్రి మారయామాత్యుడు విద్యారాజీవభవుడు. తల్లి భీమాంబిక. కవితాకాసారంలో పుట్టిన కమలంలాంటివాడు శ్రీనాథుడు. పూవు పుట్టగానే పుణ్యగంధం విరజిమ్మింది. ఈశ్వరార్చన కళాశీలుడై పురాణాగమశాస్త్ర సారాన్ని పుక్కిటపట్టాడు బాల శ్రీనథుడు. చింతామణీమంత్ర సాధనం చేసి శారదావరప్రసాదుడైనాడు. కవితాధార గంగాలహరిలా పొంగి వచ్చింది. చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడే మార్కండేయంలోని మరుత్తరాట్చరిత్రను మహాకావ్యంగా వ్రాశాడు. నూనూగు మీసాల నూత్నయౌవనం శృంగారం మీదకు చూపు మళ్లించింది. హాలగాథాసప్తశతిని ఆంధ్రీకరించాడు. కొండవీటిలో జరిగే కర్పూరవసంతోత్సవాలు అతనిలో కస్తూరీపరిమళంలాంటి స్వప్నాలను సృష్టించాయి. పాండిత్యంతో పాటు పదవిమీద బుద్ధి పోయింది. మామిడి సింగనామాత్యుడారెడ్డిరాజ్యానికి మహామంత్రి. ఆయన అన్నగారు పెగ్గడయ్య, పండితారాధ్య చరిత్రాన్ని చంపువుగా వ్రాసి ఆయన కంకిత మిచ్చి ఆయనద్వారా సింగన ప్రాపకాన్ని సంపాదించుకొన్నాడు. శ్రీహర్షుని నైషధకావ్యాన్ని ప్రౌఢి చెడకుండా శృంగార నైషధంగా

అనువదించి సింగనామాత్యుని కంకిత మిచ్చాడు. విద్వదౌషధమైన నైషధం శ్రీనాథుని కవితలో విద్వన్మకరందమైనది. 'ఆంధ్రనైషధాబ్జభవు' డనే కీర్తి కవి కబ్బింది. భట్టహర్షునిలాగానే ఆయన శ్రీనాథభట్టసుకవి అయినాడు; ఆంధ్రపంచ కావ్యకర్తల్లో అగ్రతాంబూలాన్ని అందుకొన్నాడు. తెలుగులో భావానువాదానికి ఆంధ్రనైషధం పరమప్రమాణం. నైషధకావ్యానువాదనైపుణ్యం కొండవీటి రాజ్యంలో విద్యాధికారిపదవిని ప్రసాదించింది. భోగభాగ్యాలతో తులతూగుతూ శాసనకావ్యరచనం చేస్తూ శ్రీనాథుడు దాదాపు రెండు దశాబ్దాలు నిశ్చింతగా కాలంగడిపాడు. ఆకాలంలో ధనంజయ విజయమనే కావ్యం వ్రాసియుండ వచ్చునని తెలుస్తున్నది. అది భారవి కిరాతార్జునీయానికి ఆంధ్రానువాదంకావచ్చు. ఆ తర్వాత పెదకోమటి వేమారెడ్డితో కలిసి కాశీవిశ్వనాథుణ్ణి సేవించి వచ్చాడు.

కొండవీటికి సుగంధద్రవ్యాలను సమకూర్చే వ్యాపారి అవచితిప్పయ్యకూ శ్రీనాథునికీ చెలిమి కుదిరింది. కొంత రాజకీయంకూడా కలిసివచ్చింది. శైవం ఇద్దరినీ దగ్గరికి తీసింది. తమ స్నేహానికి చిహ్నంగా అవచితిప్పయ్యసెట్టికి హరవిలాస కావ్యాన్ని అంకితం చేశాడుశ్రీనాథుడు. ఆ కథాకావ్యం అనువాదం కాదు. స్వతంత్రగౌరవాన్ని సంతరించుకొన్న రసవత్కావ్యం.

కొండవీటి రాజ్యపతనానంతరం శ్రీనాథుడు నిరాశ్రయుడైనాడు. దిన వెచ్చంకోసం దీనంగా తిరుగవలసివచ్చింది. పంట మైలారురెడ్డి ప్రాపు సంపాదించాడు. పలనాటిని దర్శించాడు. పల్నాటి వీరచరిత్రను ద్విపదలో గానం చేశాడు. పసిడికంచాలలో పంచభక్ష్యపరమాన్నాలు తిన్న ఆయన నోరు జొన్నల్నీ, సజ్జల్నీ తినలేకపోయింది. కటకటపట్టాడు. వినుకొండ వల్లభ రాయణ్ణి కలిశాడు; క్రీడాభిరామరచనంలో సహాయంచేశాడు. తెలుగులో ఆ వీథి శ్రీనాథుని కవితాపరిమళాలను గుబాళిస్తుంది. పస్తులుండికూడా కస్తూరిని అభ్యర్థించాడు తెలుగురాయణ్ణి రసిక శ్రీనాథుడు.

రాజమహేంద్రవర రెడ్డిరాజ్యం సిరిసంపదలతో తులతూగుతున్నది. శ్రీనాథు డాభీమఖండంలో రక్తిముక్తి రామణీయకత్వాన్ని దర్శించాడు. బెండపూడి అన్నయమంత్రితో బంధుత్వాన్ని చెప్పుకున్నాడు. భీమేశ్వరక్షేత్ర మాహాత్మ్యాన్ని ప్రౌఢపురాణంగా సంతరించి ఆయన సౌజన్యాన్ని సంపాదించాడు. రాజమహేంద్రవర పండితులు శ్రీనాథుని పాండిత్యప్రాభవాలకు అసూయచెంది ఆయన్ను అవమానాల పాలుచేశారు. విసిగి వేసారి విజయనగర సామ్రాజ్యాన్ని దర్శించటానికి బయలుదేరాడు. ఈ నడిమికాలంలోనే నందనందన చరిత్రం వ్రాసియుంటాడు. ముమ్మ కవి-సాయంతో ప్రౌఢదేవరాయల దర్శ

నాన్ని పొందటానికి యత్నించాడు. అది ఫలించటానికి చాలకాలం పట్టింది. ఆగ్రహంతో రాయలకు అర్జీపెట్టుకొన్నాడు. గౌడ డిండిమ భట్టుతో వాదు పెట్టు కొన్నాడు. విజయాన్నిసాధించాడు. ఆయన కంచుఢక్కను పగుల గొట్టించి కవిరాజు బిరుదాన్ని గ్రహించి, ముత్యాలశాలలో కనకాభిషేకాన్ని చేయించు కొన్నాడు. విద్యానగర సంస్థానంలో సంస్కృతానికి ప్రక్కనే ఆంధ్ర భారతికి బంగారుగద్దె నిలిపి వచ్చాడు శ్రీనాథుడు.

రాజమహేంద్రవరంలోని రెడ్డిరాజులు శ్రీనాథుని గొప్పతనాన్ని గుర్తించారు. వేమారెడ్డి కవిరాజును పిలిపించి ఆస్థాన విద్వాంసునిగా చేసికొని, వీర భద్రా రెడ్డి పేర కాశీఖండాన్ని చెప్పించుకొన్నాడు. కాశీఖండ భీమఖండాలు వస్తువుకంటె వర్ణనలు ప్రధానమైన పురాణాలు. ప్రబంధవర్ణన మార్గాని కివి మార్గ దర్శకాలు. రాజమహేంద్రవర రెడ్డిరాజ్యంకూడా కొద్దికాలంలోనే అస్తమించి పోయింది.

శ్రీనాథుడు మరలా నిరాశ్రయయుడైనాడు. సర్వజ్ఞ సింగభూపాలుణ్ణి దర్శించాడు. ఆ తర్వాత శ్రీశైలంలో మఠాధిపతుల ప్రాపకాన్ని సంపాదించు కొన్నాడు. శివరాత్రి మాహాత్మ్యాన్ని వ్రాసి శాంతభిక్షావృత్తి శాంతయ్య గారి కంకితమిచ్చాడు.

శ్రీనాథుఁడు సర్వకళాపూర్ణుడు. ఆయన జీవితంలో శుక్లపక్షం-కృష్ణ పక్షం రెండూ వెలుగు నీడల్లా వ్యాపించి పోయాయి. విద్యాధికారి అయినా, కవిసార్వభౌముడైనా చివరకు బొడ్డుపల్లిలో నాగలిపట్టి నేలదున్నే దైన్యాన్ని పొందవలసి వచ్చింది. ఏడునూర్ల సుంకాన్ని చెల్లింపలేక ఒడ్డెరాజుల కిరాతక చర్యలకు బలికావలసి వచ్చింది. శ్రీనాథమహాకవి మహోజ్జ్వల చరిత్ర విషాదాంత కావ్యమైపోయింది. భక్తినీ, రక్తినీ రంగరించిన ఆయన కవితాజీవితం మాత్రం ఆంధ్రుల హృదయరంగాల్లో ఆచంద్రతారార్కంగా నిలిచిపోయింది.

శ్రీనాథుని కవితావైభవాన్ని వేనోళ్ల పొగడినా చాలదు. అయినా, రసికులైన సహృదయులకు ఆ కవిసార్వభౌముని సాహిత్యాంశను పరిచయంచేసే హృద్యపద్యాలను సరళ వ్యాఖ్యానంతో అందించటానికి ఈ ప్రయత్నం. ఈ పద్యసంకలనంలో పాటించింది స్థాలీపులాక న్యాయం!

శ్రీనాథుని ప్రౌఢభారతి కీ పద్యవ్యాఖ్యానం ఒక పూజా పుష్పం. ఈ అవ కాశాన్ని కల్పించిన యువభారతికి నాధన్యవాదాలు.

6-10-1974 జి. వి. సుబ్రహ్మణ్యం

# శ్రీనాథుని కవితా వైభవం

హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యము ల్దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్. భీ.1.11

ఉత్తమకావ్యానికి ముచ్చటైన మూడుగుణాలు తప్పకుండా ఉండాలని శ్రీనాథమహాకవి నిర్దేశించాడు. ఒకటి : శివజటాజూటానికి అలంకారమైన చంద్ర వంకలాగా వక్రసుందరంగా ఉక్తివిలాసం లాస్యంచేయటం. రెండు : రౌద్ర మూర్తియైన చండికాదేవి పరుషపయోధర కాఠిన్యంలాంటి రీతిసౌభాగ్యం. మూడు : రసనిర్భరత్వం- ఈమూడులక్షణాలూ ఏ కావ్యాని కుంటాయో అది కలకాలం కవిలోక హృదయరంగాల్లో నాట్యంచేస్తూ ఉంటుంది.

శ్రీనాథ కవితాస్వరూపాన్ని దర్శించటానికి ఈ పద్యం ఒక చక్కని వాతాయనం. పై మూడు లక్షణాల్లో క్రమంగా ఉత్తరోత్తరాలు బలీయాలు. శ్రీనాథుడు ప్రధానంగా రసవాది. 'సరసత్వం' ఆయన కవితకు ప్రధానలక్షణం. 'నహి రసాదృతే కశ్చిద ప్యర్థః ప్రవర్తతే' అన్నాడు భరతమహర్షి. 'రసేనైవ సర్వం జీవతి కావ్యం'-రసంచేతనే కావ్యం జీవిస్తుందని చెప్పి రసధ్వనికి పట్టం కట్టాడు అభినవగుప్తుడు. కావ్యాత్మయైన రసాన్ని శ్రీనాథుడు కడపట చెప్పినా వేసిందిమాత్రం మొదటిపీటే.

రసోపకారకాలైనవి రీతులు. అందుకే 'రసభావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ' నమర్చా లన్నాడు పింగళి సూరన్న. గుణ విశిష్టపదరచనంవల్ల రీతి యేర్పడుతుంది. సమగ్రగుణగుంభితమూ, విపంచీ స్వర

సుభగమూ అయిన రచన వైదర్భీరీతి. ఉద్భటపదాలతో ఓజఃకాంతిగుణాన్వితంగా ఉండే రచన గౌడీరీతి. శిథిలమూ, మాధుర్యసౌకుమార్యగుణాన్వితమూ అయిన రచన పాంచాలీరీతి. చండికాపయోధరం సహజంగా మృదులం. రౌద్రోద్రేకం వల్ల కుచతటాలు పారుష్యాన్ని భజించవచ్చు. కాని, పయోధర తటీ కాఠిన్యం ఎంత ముదిరినా పరుషశిలాకాఠిన్యం కాలేదుకదా! రాధామాధవకర్త చింతలపూడి యెల్లయ్యకవి ఈ కాఠిన్యంపాలు కొంత తగ్గించి చెప్పాడు-

'సూనాస్త్ర ప్రమదామదస్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్
బూనంజాలు వచోవిలాసముల నేర్పుల్ సూపి కర్ణాటక
క్ష్మానాథేంద్రు సభన్ గవిత్వ విజయోత్సాహంబు గైకొన్న మా
శ్రీనాథున్ గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్'

ఈ ఔపమ్యాన్ని కావ్యానికి అన్వయించుకొంటే శ్రీనాథుని కవితారీతి ప్రధానంగా వైదర్భి, గౌణంగా గౌడి; గుణం ఓజోమిశ్రితమైన మాధుర్యం.

శ్రీనాథుడు మొదట పేర్కొన్నా మూడవలక్షణంగా పరామర్శింపదగింది ఆయన అలంకార దృక్పథం. శివుడు తలముడిపై ధరించిన అలంకారాన్నే ఉపమానంగా తీసికోవటంలోని అంతరార్థం అదే. గుణాలు కావ్యశోభను కలిగిస్తే దానిని అతిశయింపచేసేవి అలంకారాలని అంటాడు వామనుడు. అలంకారాలన్నీ వక్రోక్తులే అన్నాడు భామహుడు. కుంతకుడు వక్రోక్తియే కావ్యజీవితమంటూ లోకోత్తర చమత్కారకారియైన వైచిత్ర్యసిద్ధి వక్రోక్తివలన యేర్పడుతుందని భావించాడు. భామహుని అలంకార మార్గానికి కుంతకుని మతం విస్తృతప్రస్తారం. షడ్విధ వక్రోక్తులను సాహిత్యక్షేత్రంలో ప్రతిపాదించి వాటిని విస్తరించి చూపించాడు కుంతకుడు. ఇంతైనా ఆ మతం నిలవలేదు. బలంలేని వాదాన్ని పట్టుకొని ప్రాకులాడే బలహీనుడు కాడు శ్రీనాథుడు. వామనునిలాగా ఆయన 'సౌందర్య మలంకారః' అని భావించి, వక్రతవలన ఉక్తి అలంకృతం ఔతుందని నమ్మినవాడే అయినా ఆనందవర్ధనునిలాగా రసధ్వన్యుపస్కారకాలైన అలంకారాలకే రచనలో ప్రాధాన్యాన్ని ప్రతిపాదించినవాడు. చంద్రవంకకు సహజమైన కాంతిగుణం ఉంది, అదే దాని శోభాహేతువు. వక్రత దాన్ని అతిశయింపచేస్తుంది. ఆ సాదృశ్యాన్నిబట్టి కావ్యగుణాలే సహజ శోభాహేతువులనీ, దాన్ని అతిశయింపచేసేవే అలంకారాలనీ, అవి ఉక్తివక్రతలో ఉపజీవిస్తాయనీ శ్రీనాథుని అభిప్రాయం.

శ్రీనాథుడు గుణాలంకార విశిష్టమైన రీతిని రూపుకట్టించే రచనను రసోపస్కారకంగా చేపట్టిన కవివతంసుడు. రసం ఆయన ధ్యేయం; రీతి

ఆయన మార్గం. దండి రీతిని మార్గమంటాడు ! 'రియంతే పరంపరయా గచ్ఛంతి అనయా కరణసాధనో ఽ యం రీతిశబ్దః మార్గపర్యాయః' అని రత్నేశ్వరుడు వ్యాఖ్యానించాడు. మార్గకవిత్వమంటే రసోన్ముఖమైన విశిష్టపద రచనాత్మకమైన రీతిమార్గమేమో ! తెలుగులో ఒక విశిష్టమార్గానికి శ్రీనాథుడు కవితాసనాథుడు !

## 2

ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లేరీ నేఁటి కాలంబునన్
దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్. కాశీ.పీ.14

ఈ పద్యంలో కవిస్తుతి చేసింది అల్లాడవేమారెడ్డి అయినా, పతితకు విన వచ్చేది శ్రీనాథుని ప్రౌఢ కవితా (రీతి) సరస్వతి. గంధర్వాప్సరోభామినీ వక్షో ద్వయ గౌరవాన్ని తలపించేలా మధ్యచరణాలు రెండూ దీర్ఘ సమాస సంఘటితా లైనవి. తామరతూండ్ల జంట వంటి కోమల బాహుద్వయంలా మిగిలిన రెండు చరణాలూ రెండు వైపులా రాణిస్తున్నవి. విశిష్టపదరచనతో విభావరూప సాక్షాత్కారాన్ని కలిగించే వైలక్షణ్యం శ్రీనాథుని కవితకు నైజగుణం.

శ్రీనాథుడు కవిసార్వభౌముడు. ఆయన సృజించింది ప్రౌఢసాహిత్యాలు. సాహిత్యా లంటే రసవత్కావ్యా లని తాత్పర్యం. సార్వభౌముని సాహిత్యాలు కూడా సామ్రాజ్యాలను పాలించాయి. దాక్షారామ భీమేశ్వర క్షేత్రంలోని గంధర్వాప్సరోభామినుల వక్షోజాలమీద పరిమళసుందరంగా పరివేష్టించియున్న మంచిగంధం, కుంకుమపువ్వు పూతలు ఆకవితాసామ్రాజ్యానికి ఎల్లలు. ఆ యెల్ల లలో చల్లదనం ఉంది, రాగమాధుర్యమూ ఉంది. శృంగారరసఖాండాలు ఆ సీమలు. ఆ సీమల గౌరవాన్నీ సౌరభాన్నీ పాలించటమంటే రసజగత్తునే జయిం చటమన్న మాట ! ఆవిజయ చిహ్నమే కవిసార్వభౌమ బిరుద మని పద్యంలో ధ్వని.

"అపారకావ్య సంసారంలో కవియే ప్రజాపతి; ఆయన ఇచ్ఛానుసారంగా ఆజగత్తు రూపొందుతుంది; ఆయన శృంగారి అయితే ఆ కావ్యం రసమయ మౌతుంది" అన్నాడు ఆనందవర్ధనుడు. శృంగారి అంటే స్త్రీలోలు డని కాదు అర్థం. సర్వసృష్టి చైతన్యంలో ఉన్న స్త్రీ పుంసభావతత్త్వాన్ని దర్శించి, రమణీ

యార్థప్రతిపాదక శబ్ద ప్రపంచంలో రసోల్లాసంగా ప్రపంచించే వాడని భావం. సరసుడనీ, సహృదయుడనీ, రసికుడనీ తాత్పర్యం. శ్రీనాథుని కవితారసికత్వం ప్రౌఢతా గుణశోభితం. కవి ప్రౌఢుడు కాకపోతే శృంగారరస పోషణంలో అనౌచిత్యం అడుగుపెట్టే అవకాశం ఉంది. ఔచిత్యం ఒరవడిగా ప్రౌఢ శృంగార కావ్యజగత్తును పాలించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. నాటి కాలానికే కాదు నేటికాలానికి కూడా శ్రీనాథుణ్ణి పోలిన కవి శ్రీనాథుడే.

### 3

వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు;
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు;
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు;
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు;
నైషధాది మహాప్రబంధములు పెక్కు
చెప్పినాడవు మాకు నాశ్రితుడ వనఘ!
యిపుడు చెప్పందొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యపేర. కాశీ.పీ.13.

శ్రీనాథుని కవిత్వం ప్రాచీనాంధ్రమహాకవుల విశిష్టకవితాగుణాలకు సంగమతీర్థ మని కీర్తించాడు వేమారెడ్డి కాశీఖండంలో. వేములవాడ భీమకవి లాగా శ్రీనాథు డొక్కొకసారి ఉద్దండంగా కవిత్వం చెపుతాడట. అంటే మిక్కుటంగా, దీర్ఘంగా చెపుతాడని భావం. భావాన్ని దీర్ఘసమాసాల్లో సాగ్గొట్టి ప్రగల్భంగా చెప్పే పద్ధతి ఇందులో ఉంది. నన్నయభట్టులాగా ఒక్కొకసారి సంస్కృతాంధ్ర శబ్దప్రయోగ ప్రౌఢి ప్రదర్శిస్తాడట; గీర్వాణాంధ్రశబ్ద సంఘటన సామర్థ్యం దీనివలన వ్యక్తమౌతుంది. సమాసఘటనం, శబ్దశక్తి విజ్ఞానం ఉన్నా రసాభివ్యక్తి కవికి ముఖ్యం. రసాభివ్యంజకమైక కావ్యబంధాన్ని తిక్కన సాధించాడు. శ్రీనాథు డాసోమయాజి వాక్పాకాన్ని పుక్కిట పడతాడు ఒక్కొక్క

సారి. ఎఱ్ఱన్న ప్రబంధ పరమేశ్వరుడు. ఉక్తిని అలంకృతం చేయడంలో సహజత్వాన్ని వీడని ఒక చమత్కారాన్ని కల్పించే వైచిత్రి ఆయన రచనలో రాణిస్తుంది. దాన్ని చేపట్టి శ్రీనాథు డొక్కొకసారి రక్తికట్టిస్తాడు. పూర్వకవుల ప్రసిద్ధ ఫణుతులను అదనెరిగి కవితలో కదను త్రొక్కించినా తనదైన ఒక అపూర్వ మార్గాన్ని దుర్గమంగా నిర్మించుకొని భావికవితరాలకు బాటలుచూపించిన ప్రతిభాశాలి శ్రీనాథుడు.

కాలకంఠకఠోర కంఠహుంకారంబు, చెవులు సోకనినాఁటి చిత్తభవుఁడు
కుపితరాఘవఘన క్రూర నారాచంబు, తనువు నాటని నాఁటి వనధిరాజు
క్రుద్ధకుంభోద్భవ భ్రూలతా కౌటిల్య, వికృతిఁ గ్రుంగని నాఁటి వింధ్యశిఖరి
వీరభద్రోదార ఘోరవీరావేశ, విహతిఁ గందని నాఁటి తుహినకరుఁడు
చక్కఁదనమున గాంభీర్య సారమునను, బ్రకట ధైర్యకళా కలాపములయందు
దండనాయకచూడావతంస మైన, మంత్రి మామిడి పేమనామాత్యుఁ డెలమి.
శృం.1.35

ఈ పద్యంలో పైన చెప్పిన నాలుగుగుణాలూ కనబడతాయి. కానీ, అవన్నీ నీరక్షీరన్యాయంగా కలిసిపోయి ఒక విశిష్టసృష్టి ప్రత్యక్ష మౌతున్నది. ఎన్నో పూలతేనెలు ఈ జుంటితేనెలో ఉన్నవి. కాని ఈ పాకంమాత్రం ఈ తేనెటీగదే.

రాజమహేంద్రవరంలో ఈర్ష్యాళువులైన పండితులు కొందరు ఈతని కవిత్వాన్ని వెక్కిరించినట్లున్నారు. తనకూ ఒక వ్యక్తిత్వం ఉందని హుంకరించాడు శ్రీనాథుడు.

"ప్రౌఢి పరికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వ రేమండ్రు గాక నా కేల కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" భీ.1.15

## 4

బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ; వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ; వీశ్వరార్చన కళాశీలుండ; వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే ! శృం.1.13.

శృంగారనైషధాన్ని కృతి యివ్వమని అర్థిస్తూ మామిడి సింగనామాత్యుడు చేసిన శ్రీనాథ ప్రశంస యిది. ఆ కవిరాజుకు మాటలతల్లి పండంటి వరం ప్రసా

దించింది. కవితాధారకు కరవు లేదు. కవితావేశం గంగానదిలా పొంగివస్తే కవి కావ్యాన్ని రచిస్తాడు. కావ్యహేతువుల్లో ప్రధానమైనది ప్రతిభ. నవనవో న్మేషశాలియైన ప్రజ్ఞ ప్రతిభ అంటాడు భట్టతౌతుడు; అపూర్వవస్తునిర్మాణక్షమ మైన ప్రజ్ఞ ప్రతిభ అంటాడు అభినవగుప్తుడు. ఆ రెండులక్షణాలూ గల ప్రజ్ఞయే కవిప్రతిభ. అట్టి ప్రతిభావిశేషం పుష్కలంగా పండింది ఆర్ద్రమైన ఆ కవివరుని చిత్తంలో. ప్రకృతి సిద్ధమైన ప్రజ్ఞాప్రాభవాన్ని పరమేశ్వరార్చనలో పావనం చేసుకొన్నాడు శ్రీనాథుడు. త్రికరణశుద్ధిగా త్రినేత్రుని భక్తిశీలాన్ని సాధించి పరవశుడై పద్యగద్యాల్లో పరవళ్లు త్రొక్కించాడు. జ్ఞానం వినా భక్తికి బలం లేదు; భక్తునికి మోక్షం లేదు. వేదార్థబృంహితాలు మహాపురాణాలు. అవి కల్ప నకు కల్పకాలు, జ్ఞానానికి పెన్నిధులు. పురాణసారం తెలుసుకోవటం పురాణ పురుషుని తత్త్వం తెలుసుకోవటమే. భగవద్దత్తమైన వాక్ప్రసూనం ప్రతిభతో వికసించి, భక్తితో పరిమళించి, బ్రహ్మజ్ఞానంతో ఫలించటమే శ్రీనాథుని భాగ్యం. అట్టిభాగ్య విశేషం ఋషికల్పుడైన మనీషికిగాని సిద్ధించదు. శ్రీనాథుడు కవితాతపస్వి. కవితకోసం పుట్టాడు, కవితలో బ్రతికాడు, కవితలో రస బ్రహ్మను, పరబ్రహ్మను దర్శించాడు. ఆయన మహత్త్వాన్ని షూమిడి సింగన కీర్తించాడు ;. మనకు ఆ కవివ్యక్తిత్వాన్ని కన్నులకు కట్టించాడు.

ప్రతిభావంతుడైనా పండితుడు కానివాడు మహాకావ్యాన్ని రచింపలేడు. 'విద్వత్కవయః కవయః కేవలకవయస్తు కేవలం కపయః'. విద్వత్తు వ్యుత్పత్తిని ప్రసాదిస్తుంది. వ్యుత్పత్తి ప్రతిభకు ప్రియసఖి వంటిది. ఇది భిత్తి అది చిత్రం. ఇది సంస్కారం అది కావ్యకరణకారణం. శ్రీనాథు డెంత ప్రతిభావంతుడో అంత పండితుడు. సర్వాగమ శాస్త్రార్థసారసాగరాన్ని ఆపోశన పట్టిన అపర అగస్త్యుడు. ఇందుకు ఆయన శిష్యుడూ, బావమరదీ అయిన దగ్గుపల్లిదుగ్గన్న సాక్ష్యం చెప్పాడు.

'సంస్కృత ప్రాకృత సౌరసేనీముఖ్య, భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషితమహా, భాష్యవిద్యాసమభ్యాస బలము
నక్షపాదకణాదపక్షిలోదీరిత, న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమ శ్రుతిసాంఖ్య సిద్ధాంత, కబళన వ్యుత్పత్తిగౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య,భావరససుధాచర్వణప్రౌఢిమయును
గంధశింపంగ( గాశికాఖండనైష, ధప్రముఖ వివిధప్రబంధము లొనర్చి'
(నాసికేతోపాఖ్యానము)

## 5

చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధ కావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భర వయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమఁ
బ్రాయమెంతయు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి. కాశీ.పీ.7

శ్రీనాథుడు తన పాండిత్యాన్నిగురించీ తన కవిత్వ మహత్త్వాన్ని గురించీ కృతిభర్తల నోట పల్కించి ఔచిత్యాన్ని పాటించాడు. తననుగురించీ, తన కావ్యాలనుగురించీ, కష్టసుఖాలనుగురించీ సగర్వంగా కాకుండా సాభిమానంగా చెప్పుకొని సౌజన్యాన్ని ప్రకటించాడు.

శ్రీనాథుడు పుట్టింది పండితకుటుంబంలో. ఆయన తాత కమలనాభా మాత్యుడు సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి, కవితా విద్యాధరుడు, పద్మ పురాణసంగ్రహకర్త. తండ్రి మారయామాత్యుడు విద్యారాజీవభవుడు. కవి పండితుల కరకమలాల్లో పెరిగిన శ్రీనాథునికి బాల్యంలోనే కవితాసౌరభం ఒంట పట్టింది. ఆతడు జీవితాంతం ఆపరిమళాలను ఆంధ్రసాహిత్యక్షేత్రంలో గుబా ళింపచేశాడు.

శ్రీనాథుని జీవితంలో లాగానే ఆయన కావ్యరచనంలో కూడా ముఖ్యంగా మూడు మలుపులు కనపడతాయి. చిఱుతప్రాయం నాడే చేవగల పాండిత్యం తోపాటు, చేయితిరిగిన కవిత్వాన్ని గూడా సాధించాడు. కొండవీటి రెడ్డి రాజ్యంలో విద్యాధికారిపదవి చేపట్టిందాకా నిద్దురపోకుండా పెద్దపెద్ద కావ్యాలే వ్రాశాడు. అది ఒక్క అధ్యాయం. ఉత్సాహంతో ఉన్నతశిఖరాన్ని అందుకొనే అనంత యత్నం

అఘట్టంలో కనపడుతుంది. విద్యాధికారిగా తులలేని భోగాలను అనుభవించిన స్వర్ణాధ్యాయం మరొక ఘట్టం. కొండవీటి రెడ్డి రాజ్యపతనంతో శ్రీనాథుని జీవితంలో ఒడుదుడుకులు ప్రారంభ మయ్యాయి. నిలిచిన చోట నిలువకుండా తిరిగాడు, ప్రాపకం దొరికినా పట్టుమని పదికాలాల పాటు సుఖించలేక పోయాడు. మిత్రుల నాశ్రయించాడు, మంత్రులను పట్టుకొన్నాడు, మహారాజుల మన్ననలు పొందాడు, కానీ అతణ్ణి అదృష్టం చిన్నచూపు చూచింది-మతాల పంచల్లో చేర్చింది, పొలాలసాగుల్లో త్రోసింది, పడరాని పాట్లల్లో ముంచింది విద్యాదికారి పదవి పోయింతరవాత ఆయన విధి వక్ర మార్గం పట్టింది. ఈ విషాదాధ్యాయంలో శ్రీనాథుని చిత్తం విశ్వేశ్వర ధ్యానాయత్త మైంది.

కవిజీవితం ఆయన కావ్యజీవితాన్ని శాసించింది. అదీ మూడు వంపులు తిరిగింది. మానవీరప్రధానమైన మరుత్తరాట్చరిత్రం శ్రీనాథుని మనసును మొదట ఆకర్షించింది. తొలియౌవనం శాలివాహన సప్తశతి కోసి శృంగారరసాన్ని తెలుగు తియ్యదనాలతో చవి చూచింది. నిండు యౌవనంలో శృంగార వీరాలు మహా కావ్య పథంలో మదేభయూధంలా మనోజ్ఞంగా విహరించాయి ఉవ్వెత్తుగా లేచిన ఉదధి తరంగంలా శ్రీనాథుడు విద్యాసనాథుడైనాడు. విద్యాధికారి అయినాడు పట్టు పరుపుల్లో పవ్వళించిన పండితకవికి ప్రబంధ నిర్మాణంతో అవసరం పడలేదు. పదవి పోయిందో లేదో పరమేశ్వరుడు జ్ఞాపకం వచ్చాడు. పచ్చిమంచినీళ్ల కర వైతే గంగాధరుణ్ణి గొంతెత్తి పిలిచాడు. గంటం పట్టినప్పుడెల్లా కాలకంఠుని గాథలే కమనీయంగా గానంచేశాడు. శృంగారనైషధం తరువాత వెలసినవన్నీ శివకథా ప్రబంధాలే. భక్తి కుదిరిన శ్రీనాథుడు రక్తిని వీడి విరక్తుడు మాత్రం కాలేదు. పస్తు లుండి కూడా కస్తూరిని అర్థించాడు. భక్తి కవిత లల్లి కూడా సుక్తి మౌక్తికంలా శృంగారాన్ని వెలయించాడు. శివుణ్ణి కూడా శృంగారిని చేశాడు. రాజ్యాలు జీర్ణించినా, భోజ్యాలు పూజ్యాలయినా శ్రీనాథుడు స్వీయ కవితాసామ్రాజ్యాన్ని నిర్మించుకొన్నాడు, అందులో శివంకరంగా శృంగారానికి స్వర్ణాభిషేకం చేశాడు.

శ్రీనాథుడు శృంగారనైషధరచనాన్ని గర్వకారణంగా చెప్పుకుంటాడు. ఆయన్ని ప్రశంసించిన వారందరూ ఎన్నిచెప్పక వదలినా నైషధగ్రంథ ప్రసక్తిని మాత్రం వదలిపెట్టలేదు. 'భట్టహర్షుని' లాగానే "శ్రీనాథ భట్టసుకవి" నని చెప్పుకుంటే కాని శ్రీనాథునికి తృప్తిలేదు. "ఆంధ్రనైషధాబ్జభవు" డని ఆయన్ని పిలిస్తే "కవిసార్వభౌము" డన్న దాని కంటే వేయిరెట్లు పొంగిపోయే వాడేమో! శృంగార నైషధ కావ్యరచనం ఆంధ్రసాహిత్యంలో ఒక నూత్నాధ్యాయాన్ని ఆరంభించించి. ఆంధ్ర పంచమహాకావ్యాల్లో దాని కబ్బింది ప్రథమ తాంబూలం!

## 6

పనివడి నారికేళ ఫలపాకమునం జవియైన భట్ట హ
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్యు లా
నని కొనియాడ నేర, రది యట్టిద; లేజవరాలు చెక్కు( గీ
టిన వసవల్చుబాలకు(డు డెందమునం గల(గంగ నేర్చునే? శృం.1.17

'నైషధం విద్వదౌషధం' అని ప్రసిద్ధి. సంస్కృతంలో శ్రీ హర్షమహాకవి నారికేళపాకంలో ప్రౌఢవాక్పాటవంతో నైషధకావ్యాన్ని సంతరించాడు. కొబ్బరికాయను పీచుతీసి పగులగొట్టితేతప్ప అందులో నీళ్లూ, కొబ్బెరా మనకు దక్కవు. అలాగే ఆ మహాకవి కావ్యంలోని తాత్పర్యాన్ని సప్రయత్నంగా వ్యాఖ్యానసహాయంతో సహృదయుడు తెలుసుకొనే ప్రయత్నం చేయవలసి ఉంటుంది. అటువంటి రచన నారికేళపాకంలో ఉందంటారు. మానసికంగా అలసభావం గలవారు అంతప్రయత్నం చేయలేక అందనిద్రాక్షపళ్లు పుల్లన అన్న సామెత ననుసరించి నైషధాన్ని ఈసడించుకుంటారు. ప్రౌఢకావ్యాన్ని చదివే పఠితకూడా ప్రౌఢుడు కావాలి. అందుకు చక్కని దృష్టాంతం చెప్పాడు శ్రీనాథుడు. ముక్కుపచ్చలారని పసిబాలుని బుగ్గను జవరాలు మీటితే వాడికి మదనభావం కలుగుతుందా? అందుకు కోరమీసాల కోడెకాడే కావాలి

అర్థంచేసుకోవటానికే అంత ప్రౌఢిమ కావలసివస్తే అనువదించటానికి ఎంత పాండితీప్రాభవం కావాలి? శ్రీనాథుడు సమర్థుడు కాబట్టి సాహసించాడు. నాటికీ నేటికీ ఆంధ్ర నైషధకావ్యాబ్జభవుడుగా ఆయనే మిగిలిపోయాడు. శ్రీనాథునికి పూర్వం పురాణేతిహాసాల అనువాదం సాగింది. సంస్కృత ప్రౌఢకావ్యానువాదం శ్రీనాథునితో మొదలైంది. ప్రౌఢాంధ్ర ప్రబంధనిర్మాణానికి అది శ్రీకారం చుట్టింది.

తెలుగులో కావ్యస్పృహ నన్నయలో బీజరూపంగానూ, తిక్కనలో అంకురరూపంగానూ, ఎఱ్ఱయలో కుట్మలరూపంగానూ, నాచన సోమనాథునిలో పుష్పరూపంగానూ, శ్రీనాథునిలో ఫలరూపంగానూ పరిణమించింది. శ్రీనాథుని యుగం కావ్యయుగం అంటారు. ఆంధ్ర కావ్యస్పృహకు శ్రీనాథుడు కళాపూర్ణుడు: శృంగార నైషధరచనం శరద్రాత్రి.

శ్రీనాథుడు భావానువాదపద్ధతికి ప్రారంభకుడు అశేషమనీషి హృదయంగమంగా శబ్దాన్ని అనుసరించీ, అభిప్రాయాన్ని ఉద్దేశించీ, భావాన్ని ఉపలక్షించీ, రసాన్ని పోషించీ, అలంకారాన్ని భూషించీ, ఔచిత్యాన్ని ఆదరించీ,

అనౌచిత్యాన్ని పరిహరించీ, మాతృకానుసారంగా చెప్పింది శృంగారనైషధం. మూలంలోకంటే శృంగారరసానికి దీప్తి కల్గించటమే శ్రీనాథుని వ్యక్తిత్వం. గీర్వాణనైషధం తెలుగులో శృంగార నైషధ మైంది. కటువైన విద్వదౌషధం మధు మిశ్రితమై ఆస్వాదయోగ్యమైంది. నారికేళపాకం కదళీపాకమై సహృదయ సౌముఖ్యాన్ని సంతరించుకొన్నది.

## 7, 8

మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానానదీ
నదకాంతార పురీశిలోచ్చయుఁడనై నైకాద్భుత శ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్. శృం.2.20

కమలేందీవరషండమండిత లసత్కాసార సేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్. శృం.2.21

శృంగారనైషధంలో హంస దమయంతినిగూర్చి నలునికి వర్ణించిచెప్పే ఘట్టంలోవి ఈ పద్యాలు ఒక మూలశ్లోకంలోనుండి దూసుకువచ్చిన రెండు కిరణాలు. మూలశ్లోకం:

"సరసీః పరిశీలితుం మయా, గమికర్మీకృత నైకనీవృతా
అతిథిత్వ మనాయిసా దృశో, స్సదసత్సంశయ గోచరోదరీ." నై.2.40

'గమికర్మీకృతనైకనీవృతా' 'సదసత్సంశయ గోచరోదరీ' అన్నవి శ్రీహర్షుని ప్రౌఢసమాసాలు. మొదటిది సంస్కృతానికే చెల్లింది. 'వెళ్లు' అనే క్రియకు కర్మలుగా చేయబడ్డ అనేక గ్రామాలు కలది-అన్న అర్థం వచ్చే తెలుగు సమాసాన్ని అంత లఘువుగా బిగువుగా సంధించటం సాధ్యం కానిపని. అందువల్ల దాన్ని అవసరంకొద్దీ ప్రౌఢికోసం తెలుగులోకి సరాసరి దించుకొన్నాడు శ్రీనాథుడు. ఇక రెండవ సమాసం మాధుర్యంకోసం మార్చకుండా అలాగే కూర్చుకొన్నాడు. రెండవపద్యంలోని చివరి సమాసం శ్రీహర్షుని పదగుంఫనానికి ప్రతిధ్వందిగా పలికించిన పదవిన్యాసం.

'గమికర్మీకృతనైకనీవృతు'డనే సమాసం వెంట శ్రీనాథుని చిత్తం అనుగమించింది. దాన్ని పగులగొట్టి ఒకపద్యం, పదిలపరిచి ఒక పద్యం వ్రాశాడు. రెండు పద్యాలూ ఒకే తూగులో రెండు రవ్వల్లా మెరిశాయి. వాటిలో దేన్నీ తీసి వేయలేక రెంటినీ అట్టిపెట్టి ఉంచాడు. సూక్ష్మంగా పరిశీలిస్తే మొదటి పద్యం కంటె రెండవపద్యమే రెండాకు లెక్కువ చదివింది. ఈ పద్యాల్లో వర్ణించేది హంస, వర్ణింపబడేది దమయంతి. హంస తన ప్రయత్నాన్ని ప్రగల్భంగా చెప్పుకోవాలి; దమయంతి సౌందర్యాన్ని ప్రసాదమధురంగా చెప్పాలి. ఆ రెంటినీ పద్యంలో చెరిసగంగా పంచి ఉంచాలి. అప్పుడు వృత్తరచనంలో పూర్వ భాగం ఓజోమధురంగానూ, ఉత్తరార్ధం ప్రసాద మధురంగానూ సాగాలి. రెండో పద్యంలో మొదటిదానికంటె సమవిభక్తమైన ఛందోనిర్మాణసౌందర్యం ఉంది. కాని, రెండు పద్యాల్లోనూ రెండు శ్రీహర్ష సమాసాలూ, రెండు శ్రీనాథ సమాసాలూ సమంగా చోటుచేసుకొన్నవి. శ్రీనాథుని మూలశబ్దానుసరణంతో పాటు స్వీయసమాస ఘటనాసామర్థ్యాన్నికూడా వేనోళ్ల చాటుతున్నవి.

## 9

కాలాంతఃపురకామినీ కుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము చందనాచలతట శ్రీఖండ సంవేష్టిత
వ్యాల స్ఫారఫణా కఠోరవిషనిశ్వాసాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్షీ! సేయు దాక్షిణ్యమున్. శృం.2.32

హంస నలునికి దమయంతి గుణగణాలను వర్ణించి చెప్పింది రాజు గుండెల్లో మన్మథాగ్ని రాజుకొని మండింది. మలయపవనం సైతం మదనతప్త హృదయానికి మారణజ్వాలగా భాసించింది. ఈ భావాన్ని శ్రీహర్షు డిలా ఆవిష్కరించాడు-

'విషమో మలయాహిమండలీ విషఫూత్కారమయో మయోహితః
బత కాలకళత్రదిగ్భవః పవన స్త్వద్విరహానలైధసా॥'

నలుడు దమయంతీ విరహాగ్నికి ఇంధనమైనాడు. యముని కళత్రమైన దక్షిణ దిక్కునుండి పుట్టిన పవనమే ప్రాణాంతక మైంది. ఆ గాలి చల్లనిగాలిగా లేదు. మలయపర్వతసానువుల్లోని సర్పాల విషఫూత్కారంగా ఉంది రాజుకు. శ్రీనాథుడు శ్రీహర్షుని శ్లోకభావాన్ని చికిలిపెట్టాడు. శిల్పసుందరంగా పద్యహర్మ్యాన్ని కట్టాడు. కాలకళత్ర దిగ్భవమైన దక్షిణానిలాన్ని కాలాంతఃపుర కామినీకుచ

తటులమీది కస్తూరికా సౌరభసంపదను దొంగిలించిన గజదొంగలా రూపించాడు. మృత్యుదేవతనుసైతం కనుగప్పి కార్యం సాధించే కాలాంతకుఁ డీ పవనరాజుని నిరూపించాడు. కామినీ కుచతటీకస్తూరికాసౌరభం శ్రీనాథుని కవితలో సర్వత్రా గుబాళించే శృంగారరసభావవైభవం. ఫణిధరపుత్కారాగ్నిని ప్రతిధ్వనించే పదసముదాయం పాదదీర్ఘంగా సాగటం రీతితో రూపాన్ని చిత్రించటం పక్షి! అన్న సంబోధనం పదమధ్యంలో నిలపటం నిస్సహాయతకు వ్యంగ్యం. పరుష శ్వాసాక్షరాలైన కకారషకారాల పునరావృత్తి నాయకుని క్లిష్టస్థితినీ, దీర్ఘనిశ్వాసలనూ నిరూపించే అక్షరశిల్పం. రీతి ప్రవర్తకుని రచనారీతి ఇలాగే ఉంటుంది. మూలకర్త అభిప్రాయాన్ని ఆదరించి, భావాన్ని పరిపుష్టంచేసి, అనౌచిత్యంగా భాసించే ఇంధనోపమానాన్ని పరిహరించి, ఔచిత్యాన్ని పాటించి, రసాన్ని పోషించే శ్రీనాథుని అనువాదాని కీపద్యం అనర్ఘోదాహరణం.

## 10

తల్లి మదేకపుత్త్రిక, పెద్ద, కన్నులు
గాన విప్పుడు; మూఁడుకాళ్ల ముసలి;
యిల్లాలు గడుసాధ్వి, యేమియు నెఱుఁగదు,
పరమపాతివ్రత్య భవ్యచరిత;
వెనక ముందర లేరు నెనరైన చుట్టాలు,
లేవడి యెంతేని జీవనంబు;
గానక కన్న సంతానంబు శిశువులు,
జీవనస్థితి కేన తావలంబు;
కృపఁ దలంపఁగదయ్య యోనృపవరేణ్య!
యభయ మీవయ్య యోతుహినాంశువంశ!
కావగదవయ్య యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య యోనిషధరాజ! శృం.1.109

తనను పట్టుకొన్న నలునితో హంస చేసికొన్న విన్నపం యిది. మూలంలోని ఒక చిన్నశ్లోకాన్ని సీసంగా సాగగొట్టాడు శ్రీనాథుడు. సమ్రాట్టుహృదయంలో సానుభూతి కలగాలంటే చప్పున ముగిసే చిన్నపద్యం చాలదు. చెప్పుకొనే మనవి సమగ్రంగా లేకపోతే రాజు చిత్తం సమాధానం కాదు. దైన్యాన్ని

వ్యక్తపరచటానికి దీర్ఘసమాసాలు పనికిరావు ప్రగల్భాన్ని ప్రకటిస్తే రసభంగం కలుగుతుంది. భయంతో చిత్తవృత్తి కంపిస్తున్నప్పుడు మాటలు ద్రుతగతిలో దొర్లుతాయి, ప్రార్థనకు ఉపక్రమిస్తున్నప్పుడు కొంత విలంచితవృత్తి నాశ్రయిస్తాయి. సీసపద్య పాదాల్లో చిన్నిచిన్ని పదాల వాక్యాలు భయవిహ్వలమైన చిత్తవృత్తిని ధ్వనిస్తున్నాయి, ఎత్తుగీతిలో సంబుద్ధులు ద్రుతవిలంబితగతిని సూచిస్తున్నాయి. ఛందోవృత్తిని రసవ్యంజకంగా సంధించే శిల్పం ఈపద్యంలో సమగ్రత్వాన్ని సాధించింది.

మూలంలో హంస ముదుసలి తల్లినిగూర్చి, నవప్రసూతయైన భార్యను గురించీ చెప్పుకొన్నది. శ్రీనాథుడు చుట్టాలను, చంటిబిడ్డలనుగూడా చేర్చి పలికించాడు. ఒంటికాపురం, గంపెడంత సంసారం, పేదరికం, ఒకనిసంపాదన-ఈ నాలుగూ చెప్పినప్పుడే వాదానికి నిండుదనం వచ్చేది; వినేవాడికి కనికరం కలిగేది. మూలంలో హంస తనస్థితికి దేవుణ్ణి తలచి విలపిస్తుంది, దేవునికంటే ముందీపూజారివరం కావాలికదా! అందువల్ల తెలుగుహంస తేటగీతినంతా విషధరాజస్తుతికి వినియోగించింది. సమయోచిత సంభాషణనైపుణి శ్రీహర్షుని కృతిలో కన్నా శ్రీనాథుని పద్యకృతిలో ఎక్కువ ప్రదర్శించింది హంస. మూలాతిశయమైన కావ్యార్థకల్పనకు శ్రీనాథుని సీసం ఔచిత్య కళానివాసం.

## 11

'ప్రాతఃకాలము వాయసంబు 'పణినాపత్యోక్త శాస్త్రంబులోఁ
దాతఙ్ స్థానులు చెప్పు డెవ్వి' యను చందం బొప్పఁ గాకా యనం
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతం బిచ్చెఁ దుహీ తుహీ యని గృహారామ ప్రదేశంబులన్.'

శృం.8 19

నలమహారాజుకు వైతాళికులు ప్రాభాతగీతాలతో మేలుకొల్పులు పాడేవారు. అందులో ఇది ఒకటి. శ్రీహర్షుడందులో సంస్కృత వ్యాకరణశాస్త్ర విషయాన్ని ఆధారంగా చేసికొని కల్పనం సాగించాడు. ఆ శాస్త్రరహస్యం తెలిస్తే తప్ప ఇది అవగాహనం కాదు. పాణినీయ వ్యాకరణంలో 'తు, హి' అనే లోట్ప్రత్యయాలకు బదులుగా 'తాత(ఙ్)' అనేది ఆదేశంగా వస్తుందని ఒక సూత్రం ఉంది. ఆదేశంగా వచ్చే ప్రత్యయానికి 'స్థాని' అనే సంజ్ఞ ఉంది. కాకులు 'కాకా' అని అరుస్తా యని కవిసమయం. 'కా' అనేది "కిం?" శబ్దానికి

ప్రథమాద్వివచనం. కాకుల అరుపులు తాతజ్ఞునకు స్థానులేవని అడిగినట్లున్నాయట! కోకిలలు 'తుహీతుహీ' అని కూస్తాయని కవిసమయం. కాకుల ప్రశ్నకు కోకిల సమాధానం వ్యాకరణశాస్త్రంలోని ఒక సూత్రానికి సూక్ష్మవ్యాఖ్యానంగా ఉందని కల్పనం. శ్రీనాథమహాకవి మూలంలోని గడుసుదనాన్ని పరువం చెడకుండా తెలుగులో పదిలపరిచాడు.

శ్రీహర్షుడు నైషధంలో ఎన్నోశాస్త్రమర్మాలను కావ్యకల్పనలకు మూలాధారాలుగా ముడిపెట్టాడు. శ్రీనాథుడు తెలుగులోకి రాదగిన మర్మాలనన్నింటినీ మనోజ్ఞంగా తీసికొనివచ్చాడు. నైషధంలో పంచనైషధిఘట్టం శ్లేషార్థాలకు కాణాచి. దిక్పాలకులకూ నలునికీ సరివచ్చే అర్థాలు ఆ శ్లోకాల్లో ఆశ్లేషించి ఉంటాయి. మూలగౌరవం చెడకుండా ఆంధ్రభాషాశ్లేషల కందినంతవఱకు వాటిని ఓటువోకుండా భద్రపరచాడు శ్రీనాథుడు.

శ్రీహర్ష కావ్యాన్ని అనువదిస్తున్నప్పుడు శ్రీనాథుడు ప్రదర్శించిన ఛందశ్శిల్పం, రీతివైభవం ఆయన సొంతాలనే చెప్పాలి. ఛందం కావ్యహృదయం. దాని గతి రసభావగతికి వ్యంజకం. మూలశ్లోకగతి వేరు తెలుగుపద్యం నడక వేరు. శ్రీహర్షుని వాక్పాకం వేరు, శ్రీనాథుని రచనారీతి వేరు. శ్రీనాథు డెంత సమాసం వాడినా, ఓజోగుణం గండూషించినా మాధుర్యాన్ని మాత్రం మరచిపోడు. వీణానాదంలా శ్రీనాథుని రచన వీనులవిందు చేస్తుంది. పఠితను మోహపరవశుణ్ణి గావిస్తుంది. సర్వరసాలను ఒప్పించే వైదర్భికి ఆ సమ్మోహన గుణం ఉంది. వైదర్భిని చేపట్టిన వాడు నలుడు; వైదర్భీరీతిని చేపట్టినవాడు శ్రీనాథుడు–

'వైదర్భివోలెఁ గవితా, వైదర్భి నరేంద్ర నీకు వశమయ్యెడు సూ
ర్యోదయవేళ జపింపు కృ,తాదరమున నస్మదీయమగు మంత్రంబున్'

అని వాణి నలునికి వరం ప్రసాదించింది. నలునిలాగే శ్రీనాథుడూ 'బ్రాహ్మీదత్త వరప్రసాదుడు' కదా!

## 12

దానకళా కలాప సముదంచిత సారవివేక సంపదన్
మానిత యాచమానజన మానసవృత్త్యభిపూర్తి బుద్ధి యె
వ్వానికి లేదొకింతయును, వాఁడొకరుండు భరంబు ధాత్రికిం;
గానలు గావు, శైలములు గావు, పయోధులు గావు భారముల్.

శృం.3.56

అర్థులకు దానం చెయ్యలేనివాడు భూమికి బరువుచేటు. నిజంగా పుడమి తల్లికి అడవులూ, కొండలూ, సముద్రాలూ వాడికంటె భారం కావు. ఇంద్రాదులు నలునికి చెప్పిన నీతివాక్య మిది. శ్రీనాథుని సూక్తిరచనా సామర్థ్యానికి ఈపద్యం మచ్చుతునక. మూలంలోని ఒకశ్లోకం తెలుగులో నిండైన ఒకపద్య మైంది. సూక్తులను స్వయంసమగ్రంగా చిత్రించటం శిల్పం. నన్నయ తెలుగుకవుల కందరికీ ఇందులో గురువు. ఈ పద్యంలో దానగుణానికి ప్రాధాన్యం ఉంది. శ్రీనాథుడు దానినే పెంచి సమాసగర్భితం చేశాడు. ప్రధానాంశాన్ని ప్రకృష్టంగా చెప్పటం సూక్తిశిల్పంలో ఒకరహస్యం. మిగిలిన అంశాన్ని పదప్రయోగ వక్రత నాశ్రయించి చమత్కృతం చేయటమేకాక పరిసంఖ్యాలంకారశోభితం చేశాడు శ్రీనాథుడు. శబ్దార్థరామణీయకత్వంతోపాటు అలంకారచారుత్వం కూడా శ్రీనాథుని సూక్తి మాధుర్యానికి శక్తి నిచ్చింది.

అనూదితాలే కాక సంత్రతాలైన సూక్తులుకూడా శ్రీనాథుని రచనలో ఎన్నో ఉన్నాయి. మచ్చుకు మరొక్కటి పేర్కొంటాను-

'కంటికి నిద్ర వచ్చునె ? సుఖం బగునే రతికేళి ? జిహ్వకున్
వంటక మిందునే ? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె ? మానుషంబు గలయట్టి మనుష్యన కెట్టివానికిన్
గంటకుఁడైన శాత్రవుఁ డొకండు దనంతటి వాఁడు గల్గినన్' కాశీ. 1.108

కాశీఖండంలోని వింధ్యగర్వభంగఘట్టంలో చెప్పిందైనా ఈ పద్యం శ్రీనాథుని జీవితంలోనుండి పుట్టిందే. డిండిమభట్టుతో వైరం వచ్చినప్పుడు శ్రీనాథుడు ఆశువుగా చెప్పి ఉండవచ్చు. దాన్ని అదనెరిగి కావ్యంలో పొదిగి ఉండవచ్చు. సూక్తులు వృత్తాల్లోనే కాకుండా ఉపజాతుల్లో కూడా కనపడతాయి. ఉదా॥

'అతిథి కడునల్పుఁడైన నత్యధికుఁడైన
నింటి కేతేరఁ బ్రియమందు నెవ్వఁడేని
వానిగౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకారగౌరవంబు.' కాశీ. 1.98

## 13

కాంచన ముద్రికామణి నికాయకరాళవలన్మయూఖ రే
ఖాంచల చక్రచుంబితనఖాంకుర మైన నృపాలు చెట్టఁ బ
ట్టించెఁ బ్రమోదసంపద ఘటిల్లఁగ నొక్కపురంధ్రి నవ్వరో
మాంచము గ్రొత్త లేఁజెమరు నయ్యెరు గేలును సంభవింపగన్.
శృం.6.104

నలదమయంతుల వివాహఘట్టంలో వధూవరుల పాణిగ్రహణాన్ని వర్ణించే పద్యమిది. మూలంలో లే దీచెట్టఁబట్టే ఘట్టం. శ్రీనాథుఁడు తెలుగు దేశంలో వెలుగులో ఉన్న ఆచారాలను తిక్కనలాగా సమయంచూచి కావ్యకథార్థాల్లో చొప్పించే జాత్యభిమానం ఉన్నకవి.

నలమహారాజు ఆజానుబాహుత్వాన్ని దీర్ఘ సమాసంతో వ్యంజింపజేయటం రచనా శిల్పం. సాత్త్వికభావాలతో రసభావాలను వ్యంజింప జేయటం వర్ణనా శిల్పం. శాబ్దికంగా ఆర్థికంగా కూడా కావ్యాన్ని ధ్వనిమంతంచేసే మార్గం శ్రీనాథునిది.

కవిత్రయంవారి రచనలో అర్థానికి శబ్దం సేవ చేస్తుంది; నాచన సోమా దుల్లో శబ్దానికి అర్థం గౌణంగా నిలుస్తుంది. శ్రీనాథుని రచనంలో శబ్దార్థాలు రెండూ చెట్టఁబట్టి నడుస్తాయి. అది ఆ నాటికి తెలుగులో కొత్తవింత. శబ్దం స్త్రైణం; అర్థం పౌరుషం. అందుకనే కాళిదాసు శబ్దార్థాలను పార్వతీ పరమేశ్వరుల్లా భావించాడు. శబ్దం ఆకృతిసౌష్టవాన్ని కల్పిస్తే అర్థం ఆత్మసౌందర్యాన్ని ప్రసాదిస్తుంది. శబ్దగుణాలు యౌవనాదుల వంటివి. అర్థగుణాలు ఔదార్యాదుల వంటివి. రసవాదులు ఆకృతిగుణంకంటె ఆత్మగుణాన్ని ఆదరిస్తారు. ఆనంద వర్ధనాదులు ఆకృతి ఆత్మను ధ్వనిస్తే కావ్యానికి గుణంగానే భావించారు. శ్రీనాథుడు శబ్దంచేత ఆకృతి శిల్పాన్ని రూపిస్తాడు; ఆకృతితోపాటు ఆత్మను కూడా ఆరాధిస్తాడు. ఆకృతి విలాసం ఆత్మతేజానికి అందగా నిల్పటమే ఆయన రీతితత్త్వం. కంటికింపుగా లేని వనితను చూస్తే శ్రీనాథునికి కంటకింపు. అలాగే సరసత్వంలేని సారసాక్షిని ఆయన విరసంగా చూస్తాడు. కదిరిపురం వారకాంతలమీద చెప్పినచాటువు ఇందుకు సాక్ష్యం చెపుతుంది.

'చీరయు ముక్కుముంగరయుఁ జెంపల గంధము చుక్కబొట్టు
జీర ఝుణంఝుణారవముఁ జేతులఁ గంకణ నిక్వణంబు నొ
య్యారపు జాలుకొప్పును గయాలితనంబును గాని లోన శృం
గార మొకింత లేదనుటఁ గంటిని యీపురి వారకాంతలన్"

అలంకారా లెన్ని ఉన్నా, ఆకృతిసౌష్ఠవం ఎంత ఉన్నా, ఆత్మగుణం కావాలి, రస భావ దీప్తి కావాలంటాడు శ్రీనాథుడు. దమయంతీ నలసార్వభౌముల పాణి గ్రహణం ఆయన కవితలోని శబ్దార్థాల సమవ్యంజకత్వానికి వ్యాఖ్యానం.

## 14

"ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ల
లీలమాణిక్యాంగుళీయకములు;
కల్పింత నేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరికాపుండ్రకముల నొసల;
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ
గమ్మని క్రొత్తచెంగల్వ విరులు
ధామముల వెండియును బైఁడి దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి యేలింపఁ గౌతమీతటమునందు" భీ. 1.41

రాజమహేంద్రవరాన్ని పాలించిన వీరభద్రారెడ్డి అన్న గారైన వేమ భూపాలుని దానవైభవాన్ని శ్రీనాథు డీ పద్యంలో వ్యంగ్యసుందరంగా వర్ణించాడు. పద్యం లోని వాచ్యార్థం ఇది. వేమారెడ్డి తమ్ముడైన వీరభద్రారెడ్డిచేత గోదావరీ తీరంలో రాజ్యం చేయిస్తున్నరోజుల్లో అగ్రహారాల్లో ఉన్న బ్రాహ్మణోత్తములు దర్భలు పెట్టుకుండే వేళ్లకు మాణిక్యాలు పొదిగిన ఉంగరాలు ధరించటం నేర్చుకొన్నారు. గంగమట్టియబొట్టుమీద కస్తూరితిలకాన్ని దిద్దుకోవటం అలవాటు చేసుకొన్నారు. నూలుజందెములప్రక్క ముత్యాలసరాలు అమర్చుకొన్నారు. సిగలకూ నడుముకూ చెంగల్వదండలు చుట్టుకొన్నారు. వారి యిళ్లల్లో వెండిబంగారాలు దండిగా నిల్వ లుండేవి. వారి కందరికీ ఆవైభవం ఎలా వచ్చింది? వేమభూపాలుని దాతృత్వంవల్ల అని వ్యంగ్యం. ఆయన వదాన్యతకు మణికిరీటం సోదరునిచేత రాజ్యంచేయించటం. 'జ్ఞాతిశ్చే దనలేన కి'మ్మనెడి సూక్తిని బట్టి ఆ సోదరుల మధ్య రవరవ లుండాలి. కాని వారి భాతృప్రేమ నభూతో నభవిష్యతి. ఇదంతా ఈ పద్యంలోని ధ్వని. ధ్వనిప్రధానమైన కావ్యమే ఉత్తమమైన దని ఆనందవర్ధనాదులమతం. ఇది వస్తుధ్వని. వస్త్వలంకారధ్వనులు రసధ్వనిలో పర్యవసిస్తాయని అభినవగుప్తుడు.

ఇలాంటి వెన్నో పద్యా లున్నాయి శ్రీనాథుని కావ్యాల్లో-మచ్చుకు-

1. 'తనకృపాణము సముద్భటవైరి శుద్ధాంత
   తాటంకముల కెగ్గు దలఁచుచుండ'- శృం. 1.9

2. కాలకంఠ కఠోరకంఠహుంకారంబు
   చెవులు సోకని నాఁటి చిత్తభవుఁడు'- శృం. 1.35

3. 'కండూయనము సేయుఁ గరటి శుండాదండ
   పుష్కరమ్మున సింహపోతకంబు'- కాశీ. 2.48

శ్రీనాథుడు సీసపద్యరచనకు ప్రసిద్ధి. ఆయన సీసంలో చూపినన్ని హొయలు తెలుగుకవుల్లో చూపినవారు అరుదు. ఏ చరణాని కాచరణం విరిగి పోవటం, చరణఖండాలు సమంగా విరగటం, గణాలూ, గణాలజంటలూ గతిలో సమంగా సాగటం, ప్రతిచరణం క్రియతో ఆరంభం కావటం, క్రియతో అంతం కావటం, చరణపూర్వోత్తరార్ధాలలో గండూషింపు గుస్తరించటం - ఇలా ఎన్నో విధాల శ్రీనాథుని సీసాలు జాత్యశ్వాల్లా కదనుత్రొక్కుతుంటాయి. తెలుగులో శ్రీనాథుని పేరుతో సహా సీసం జంటగా తలపుకు వస్తుంది.

వ్యంగ్యసుందరమైన పై సీసపద్యాన్ని శ్రీనాథుడు కాశీఖండావతారికలో కూడా యథాతథంగా నిలుపుకొన్నాడు. శ్రీనాథుని అవతారికలకు సాహిత్యంలో ప్రత్యేకస్థాన ముంది. సహృదయులు వాటిని సాహిత్యగౌరవం కోసం చదివితే, చరిత్రపరిశోధకులు చారిత్రకసామాగ్రికోసం పరిశీలిస్తారు. శ్రీనాథుడు సమకాలీన చారిత్రక వ్యక్తులను సత్యసుందరంగా వర్ణించి భావిచరిత్రకారులకు తోడ్పడ్డాడు.

తెలుగు భాషఅన్నా, తెలుగు దేశమన్నా, తెలుగువారి ఆచారవ్యవహారాలన్నా శ్రీనాథుని కమితాభిమానం. కర్ణాటాంధ్రాలలో కడముట్ట తిరిగాడు. కాశీ విశ్వేశ్వరుణ్ణి కళ్లారా చూచివచ్చాడు. చూచింది చూచినట్లు చెప్పే నైజం ఆయనది. కవిగా లౌకికసత్యాన్ని అలంకృతం చేయవచ్చు కాని ఆయన సాహిత్యంలో సమకాలీన సమాజం సజీవంగా ప్రతిబింబించింది. శ్రీనాథునిలాగా తెలుగు నాడును గూర్చి చెప్పినకవి అంతవరకూ లేడు.

## 15

ఆంధ్ర భూభువనమధ్యము పుండరీకంబు,
    సప్తగోదావరజలము తేనె,

బ్రహ్మాసంవేద్యాది బహుతీర్థములు రేకు,
　　　　　లకరులు చారుదివ్యస్థలములు,
నాళంబు లవణాబ్ధి వేలావిభాగంబు,
　　　　　కల్యాణ భోగమోక్షములు తావి,
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక,
　　　　　హంసంబు భీమనాయకుఁడు శివుఁడు,
గౌతమీ సింధు కౌంతేయ కణ్వనదులుఁ
దుల్యభాగయు నేతేరు దుమ్మికోనలు
భువనసంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ ! సంసారతాప శాంత్యౌషధంబు. భీ.3.50

కన్నతల్లీ, జన్మభూమీ ఈ రెండూ స్వర్గంకంటే గొప్పవి. శ్రీనాథుడు తెలుగువాడై పుట్టటం ఆంధ్రమాత పుణ్యఫలం. దాక్షారామ పుణ్యక్షేత్రం ఆమహాకవి ప్రతిభాసరస్సులో శతపత్ర సుందరిలా వికసించింది. కస్తూరి వాసనలతో గుబాళించిన కొండవీటిని వదిలిం తర్వాత ఆ రసికమూర్తిని గోదా వరీ ఖండ ప్రకృతి రామణీయకత్వం హృదయానికి హత్తుకుంది. రక్తిముక్తులు రెండూ రాశిపోసిన ఆ పుణ్యభూమి ఆ కవిరాజు కంఠంలో అమరగీతిగా జాలు వారింది. తెలుగు నేలంటే శ్రీనాథుని కెంత అభిమానం!

ఆంధ్రభూమికి నడిమిగడ్డైన భీమమండలం ఆయనకు పుండరీకంగా దర్శన మిచ్చింది. పూవుల్లో పద్మం శ్రేష్ఠం. శ్రీలు పొంగిన భాగ్యభూమిని పద్మంగా భావించటంలోనే ఔచిత్యం ఉంది. రూపచిత్రణాన్ని రూపకాలంకార మండితం చేశా డామహాకవి. భీమమండల పుండరీకానికి సప్త గోదావరజలం మక రందం, పుణ్యతీర్థాలు రేకులు, దివ్యక్షేత్రాలు కింజల్కాలు, తూర్పుసముద్ర తీరరేఖ నాళం, భోగమోక్షాలు కమ్మతావులు, దాక్షారామక్షేత్రం తామరదుద్దు, గౌతమీసింధు కౌంతేయాది నదులు నామపేరలు–ఇక భీమేశ్వరస్వామి ఆపద్మ సన్నిధానంలో అవతరించిన రాజహంస. ఎంత చక్కని రూపకల్పన!

భావుకుఁడైన పఠితకు భీమమండలం హృదయకమలంగా భాసిస్తుంది. భీమేశ్వరుడు జీవేశ్వరుడుగా నిలుస్తాడు. రూపకంలోని ఉపమానధర్మం ఉప మేయ స్ఫూర్తిని ఊహాపథంలోకి పంపుతుంది. ఆలోచనా మృతంగా పఠితకు

అనుభూతి నిస్తుంది. అలంకారచర్వణంలో రక్తి ఉంది, తత్త్వ చింతనంలో ముక్తి ఉంది.

భీమఖండ కావ్యాస్వాదనంలోని అంతరార్థాని శ్రీనాథు డీ పద్యంలో అవిష్కరించాడు. కథ స్కాందపురాణాంతర్గతమైనా తెలుగు దేవుని దివ్యచరిత్ర మది. సంస్కృతంలోని గోదావరీ ఖండం తెలుగులో భీమఖండమైంది. దాక్షా రామం దక్షిణకాశి. కాశికా విశ్వేశ్వరుని కంటె కరుణా మయుడు భీమేశ్వరుడు. భీమఖండంలోని వస్తువు క్షేత్రమాహాత్మ్యం. స్థలదేవతీర్థ మాహాత్మ్యలను వర్ణించే పురాణ మది. వస్తువుకంటే వర్ణనకే అందులో వాసి యెక్కువ. ప్రవాహగంభీ రంగా సాగే ప్రకృతి పురుషవర్ణనంలో ప్రస్తుతులు తరంగభంగీ విన్యాసాన్ని వెలారుస్తాయి, ఉపాఖ్యానాలు ఉజ్జ్వలద్వీపాలుగా ప్రకాశిస్తాయి. పురాణంలో కథ కాదు ముఖ్యం-బోధ. అది భీమనాయకుని మహిమ. మహిమార్థ బోధ వలన పఠితల మనస్సుల్లో పర్యంతాన మిగిలేది శాంతం. సంసార తాపమంతా చల్లారి శివంకరమైన శాంతాన్ని ప్రసాదించటమే పురాణ లక్ష్యం. శ్రీనాథుడు భీమేశ్వర పురాణాన్ని శాంత్యౌషధంగా తెలుగు వారికి సమర్పించాడు.

ఆంధ్రనైషధం శృంగార రసోపనిషత్తు; భీమేశ్వర పురాణం శాంత రసాగమం. ఒకటి నిషధేశ్వరుని నిర్మల చరిత్రం-మరొకటి నిటలాక్షుని కటాక్ష మాహాత్మ్యం!

## 16

గరళకూట వినీలకంఠాయ శంభవే
మదనాంతకా యోం నమశ్శివాయ!
కాద్రవేయాధిప గ్రైవేయభూషాయ
మధుభిత్సఖా యోం నమశ్శివాయ!
కుంభినీధరసుతా కుచకుంభ పరిరంభ
మహాలోలుపా యోం నమశ్శివాయ!
వేదాది నిశ్శేష విద్యావధూమౌళి
మణికలాపా యోం నమశ్శివాయ!
గంధ దంతావళ జలధరాంతకాది
విబుధ పరిపంథి వాహినీ నిబిడవర్గ
బంధఘోరాంధకార సంభారకిరణ
మాలినే శాశ్వతా యోం నమశ్శివాయ! భీ.3.210

వ్యాసుడు భీమేశ్వరుణ్ణి స్తుతించిన పద్య మిది. గీర్వాణమహాపురాణకర్త చేసిన స్తుతిని సంస్కృతంలో నిబంధించటం సార్థకం. భాష సంస్కృతమైనా పలికింది ఆంధ్రచ్ఛందంలో. అది ఔచిత్యం. అనువాదముఖంగా వ్యాసునితో తాదాత్మ్యాన్ని భజించిన శ్రీనాథుడు పలికిన సీస మిది.

శ్రీనాథుడు ఈశ్వరార్చనకళాశీలుడు. ఆగమోక్త ప్రకారం శంభు లింగాన్ని నిత్యార్చనంలో నిలుపుకొన్న నిష్ఠామయుడు. పంచాక్షరీమంత్ర పరమ సిద్ధుడు. దక్షిణకాశికి విచ్చేసిన వ్యాసుని చిత్తంలో శివభక్తి శివమెత్తి నటించింది. వచనగీతాలలో, దండకాలలో, నమోవాచకగద్యాలలో, మార్గదేశివృత్తాలలో బహుభంగుల లాస్యంచేసింది. కాశీఖండంలోనూ అంతే. భీమఖండ కాశీఖండా దుల్లో శ్రీనాథుని శివస్తుతి పరాయణశీలానికి చక్కని చొరవ దొరికింది. పంచా క్షరీ మంత్రపూతమైన ఈ స్తుతి మంత్రసదృశమే కాక-దేవభాషలో ఉండటం వల్ల అటు దేవదేవునికీ, తెలుగుపద్యంలో జాలువారటం వల్ల ఇటు తెలుగుబిడ్డ లకూ మనసుకెక్కుతుంది.

భక్తిలో రక్తిని రంగరించిన రసికుడు శ్రీనాథుడు. నిర్గుణమూర్తిగా కంటే సగుణమూర్తిగా శివుణ్ణి శ్రీనాథు డెక్కువగా కీర్తించాడు. సగుణంలో సరసత్వానికి స్థాన మేర్పడుతుంది. విరూపాక్షు డెంత వేదాంతవేద్యుడైనా 'కుంభినీధరసుతా కుచకుంభ పరిరంభ మహాలోలుపు'డని గూడా శ్రీనాథుడు చిత్రిస్తాడు. భీమఖండ పుండరీకంలో పరమహంసలా భాసించే పరమేశ్వరుఁడు 'కల్యాణభోగమోక్షముల తావిని' చవిచూచినవాడే! వాసనలను బట్టి వర్తనలు ప్రవర్తిల్లుతాయి.

## 17

గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలుఁ గట్టు
పసిడికమ్ముల పట్టుపచ్చడంబు;
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదము గూర్చి;
నిడుద పాములరాజు తొడవు లెన్నఁడొ కాని
తారహారములు నిత్యము ధరించు;
నృకరండరుండ మాలిక లెన్నఁడో కాని
ధరియించు కల్హారదామ మెపుడు;

కాటి నడుచక్కి నెన్నడో గాని యుండు
దతువాటి సువర్ణ సౌధములమీఁద
నెన్నఁడో పిశాచులను గాని యిందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు. భీ.1.116

పరమపురుషుని ప్రభావం ప్రకృతిమీఁద పడినట్లు చిత్రించటం క్షేత్ర మాహాత్మ్యాల సామాన్య లక్షణం. భీమఖండంలో ఈ సూత్రం విపరీతంగా భాసించటం విశేషలక్షణం. ప్రౌఢలైన దాక్షారామ వేశ్యావనితలు పరమేశ్వరుణ్ణి తమ పంచలకు రప్పించుకొనగల జాణలు. శృంగారియైన శివుడు చిత్తజ ప్రకృతికి దాసుడై వికృతిని ప్రకటిస్తాడు. మదనాంతకుని మనోజ వికారాన్ని మనోజ్ఞంగా చిత్రించిన పురాణం భీమఖండం కంటే పూర్వం లేదేమో! కాలాంతకునిమీద పడింది కాలమహిమ కాదు; దేవవేశ్యలు స్వర్గనుండి దిగివచ్చి సానికూతుళ్లగా నిఁచిన క్షేత్రమహిమ! ముదుసలి మనసులో మోహం ముంచు కొనివచ్చింది.

'పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాలై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దాక్షారామ మహిమ మగునో కాదో!' భీ. 1.113.

సాంబశివుని సానికూళ్ళపై మక్కువ కళత్రాన్ని సైతం కన్నుగప్పి సానివాడకు రహస్యంగా వెళ్లేంతవరకు తెచ్చింది. ధూర్జటి ధూర్తు డైనాడు.

'ఏనయం గల్గిన కూర్మి భృంగిరిటిఁ గానీ తండుఁగానీ నికుం
భుని గానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్ను మొఱంగి యప్పురమునం గన్నేఱుకాఁదారిప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్' భీ.1.112

సానికూతుళ్ల సరసాలకోసం సహజాలంకారాలను చాలించి శృంగార భూషలను చేపట్టాడు. వదలి పెట్టిన ఉడుపుకు సీసపద్యఖండంలో సగమే చోటు దొరికింది. వలపుమీర తాల్చిన నూత్నాలంకారానికి సీసపద్యపాదంలో సగపాలు లభించింది. సీస పద్యం ఏకవియైనా వ్రాస్తాడు కాని వస్తుతత్త్వం వ్యంజింపజేసే శిల్పం శ్రీనాథుని సొత్తు.

## 18

శ్రీ భీమనాయక శివనామ ధేయంబు
చింతింపనేర్చిన జిహ్వజిహ్వ
దక్షవాటీ పురాధ్యక్షు మోహనమూర్తి
చూడంగ నేర్చిన చూపుచూపు
దక్షిణాంబుధి తటస్థాయి పావనకీర్తి
చే నింపనేర్చిన చెవులు చెవులు
తారకబ్రహ్మ విద్యాదాత యౌదల
విరులు పూన్పఁగనేర్చు కరము కరము
ధవళకర శేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగనేర్చిన యడుగు లడుగు
లంబికానాయక ధ్యానహర్ష జలధి
మధ్యమునఁ దేలియాడెడి మనసు మనసు. భీ.3.197

ఈ పద్యం చదవంగానే తెలుగువారికి 'కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ' అనే పోతనగారి పద్యం చప్పున జ్ఞాపకానికి వస్తుంది. ఆ తరువాత దానిమీద శ్రీనాథుని ప్రభావం ఉన్నదని ఊహకు తోస్తుంది. వెంటనే ఈ పద్యానికీ ఆ పద్యానికీ కొంత భేద ముందని కూడా స్ఫురిస్తుంది. ఆ భేద మేమిటి?

రెండు పద్యాలూ భక్తిభావ వ్యంజకాలే. కానీ, శ్రీనాథుడు చెప్పే పద్ధతిలో రాజసం రాణిస్తున్నది; పోతన కవితలో పారవశ్యం లాస్యంచేస్తున్నది. వస్తుతత్వం ఒకటే అయినా కవి వ్యక్తిత్వాన్ని బట్టి కవితలో భేదం కనవస్తున్నది. సీసపద్యపాదాలను సమవిభక్తంచేసి పూర్వార్ధంలో భీమేశ్వరాకృతిని సమాసఘటనంతో సాక్షాత్కరింప చేసి ఆ మూర్తిని అర్చించాలని ఆదేశిస్తున్నట్లున్నది శ్రీనాథుని సీసం. పోతన్నగారి సీసం పురుషోత్తముని పేర్లు చెప్పి సంకీర్తనం చేస్తున్నట్లున్నది. లాటానుప్రాసాన్ని పదాంతాల్లో నిలిపి పద్యానికి తూగు శ్రీనాథుడు కల్పిస్తే, పోతన ప్రతిపాదఖండాంతంలోనూ నిల్పి; పునరావృత్తిని ద్విగుణీకృతం చేసి భక్తిమత్తచిత్తవృత్తిని వ్యంజింపచేశాడు. శ్రీనాథుని శైలిలో భక్తి మునిగిపోతుంది; పోతనగారి శైలిలో భక్తి తేలియాడుతుంది.

## 19

కాదుకా దుదయాద్రి కనకకూటం బిది
డంబైన పానవట్టంబుగాని
కాదుకా దిది సుధాకర పూర్ణబింబంబు
కాశ్మీరశంభు లింగంబుగాని
కాదుకా దుదయ రాగప్రకాశం బిది
నవకుంకుమాలేపనంబుగాని
కాదుకా దిది కళంకచ్ఛటారింఛోళి
పూజ చేసిన కల్వపువ్వుగాని
యనఁగ సప్తార్ణవములు మిన్నంది కొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమశరసార్వభౌము ముత్యాలగొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెలవెల్లిఁ దేల్చె. భీ. 2.42

ప్రకృతిని పరమేశ్వర స్వరూపంగా భావించే ప్రజ్ఞ శ్రీనాథు డీ సీసంలో ప్రదర్శించాడు. విశ్వంలో విశ్వాత్మకుణ్ణి దర్శించే విశాలమైన భక్తి యీ భావనంలో కనపడుతుంది.

చంద్రోదయవర్ణనం ఇందులో వస్తువు. అవస్థాంతరాలతో చంద్రబింబావిర్భావం ఇందులో దర్శనీయమౌతుంది. ఉపమేయం చంద్రబింబం. ఉపమానం శివలింగం. కవి ఉపమేయాన్ని చెపుతున్నా ఉపమానాన్ని మన కన్నులకు కట్టించటం ధ్యేయం. అందువలన ఉపమేయాన్ని చెప్పి అపహ్నవం చేశాడు.

తూర్పు కొండకోన వెనక చంద్రుడు తలయెత్తుతున్నాడు. కనపడుతున్నది కనకశిఖరం. అది శిఖరం కాదనీ శివలింగపు పానవట్టమనీ వర్ణిస్తాడు కవి. ఆ తరువాత పూర్ణచంద్రబింబం పొడసూపింది. అది కాశ్మీర శంభులింగమంటాడు. ఉదయచంద్రుడు రాగకాంతితో రాణిస్తున్నాడు. ఆ అరుణకాంతి శివలింగాని కలందిన కుంకుమాలేపనమని రూపిస్తాడు. శశాంక కళంకాన్ని శివలిగంపైని కలువపువ్వుగా కీర్తిస్తాడు. ధవళకాంతులతో వెన్నెల కుమ్మరిస్తున్న ఆ వెలుగుతేనిని శివప్రభువు దాల్చిన ముత్యాలగొడుగుగా మూర్తికట్టిస్తాడు. లోకాన్ని వెన్నెలవెల్లువలో ముంచుతున్న కలువతేనిని కాదని కన్నుకప్పటం

అంత తేలికపనికాదు. అందువలననే 'కాదుకా'దనే క్రియను సీస పద్యపాదారంభంలో కదను త్రొక్కించాడు. అర్థాలంకారాన్ని సార్థకం చేశాడు.

చంద్రబింబంలో చంద్రమౌళిని దర్శించిన శ్రీనాథుని భక్తి చరితార్థం!

## 20

ఏ ఏటేట విడినీట నిరుగారునుం బండుఁ
బ్రాసంగు వరిచేలు పసిఁడి చాయఁ
బరిపాకమున వేరుపనసపండుల తావి
యిందిందిరములకు విందు సేయు
వేఁబోకఁ బొలుపారు వింధ్యాద్రి పవనంబు
పోఁకపువ్వులతావిఁ బుక్కిలించు
వేశ్యావాటికలందు విహరించు వలరాజు
ననయంబుఁ జెఱుకువిల్లును ధరించు
నారదంబులవలపు పొన్నలఁ బెనంగి
విచికిలామోదములతోడ వియ్యమందుఁ
బాటలీ పుష్ప కేతకీ పరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు. భీ.2. 54

భీమేశ్వరమండలానికి బంగారుగద్దె వంటిది పీఠికాపురం. నేటి పిఠాపురం. ఆ పట్టణ పరిసరాల్లో పసిడివన్నెల వరిచేలు, పండ్ల పసందుల పనసతోటలు, పూలతావులు పుక్కిలించే పోకతోపులు, వలపుజల్లులు ముసురుకొనే వేశ్య వాటికలు, కమ్మతావులు క్రమ్ముకునే పూలపొదరిళ్లూ-సహజసుందర వాతావరణాన్ని సంతరిస్తున్నవి. తెలుగుపంటల్నీ, పండ్లతోటల్నీ, పూలతావుల్నీ చూచేసరికి ఈ తెలుగు కవిరాజుకు తనువు పులకించింది. ఒక్క పీఠికాపురమే కాదు ఆ భీమ మండలమంతా తెలుగువారి సస్యలక్ష్మికి కొలువుకూటంలా కన్నులపండువు చేస్తుంది. సస్యలక్ష్మితోపాటు మోక్షలక్ష్మి దివ్యక్షేత్రాలలో దీవనలిస్తుంది. ఆంధ్రభూమి భావనమే శ్రీనాథునకు అఖండానందం.

'ఎక్కడ జూచిన న్సరసి, యెక్కడఁ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని, యెక్కడఁ జూచినఁ బుష్పవాటికం

బెక్కడఁ జూచిన న్నది, మహీవలయంబున భీమమండలం
బెక్కడ ? అన్యమండలము లెక్కడ ? భావనచేసి చూచినన్' భీ. 3.23

భీమఖండంలో శ్రీనాథుడు తెలుగునేలను తనివితీర వర్ణించాడు. మూలంలో లేని రాజమహేంద్రవరాన్ని రాణకెక్కేటట్లు కీర్తించాడు. కావ్యమంతా క్షేత్రవర్ణనమే-దాక్షారామం, భీమేశ్వర దేవాలయం, పంచారామాలు, పంచతీర్థాలు, సప్తగోదావరి, ద్వాదశతీర్థాలు, తుల్యభాగానదీతీర దేవతలు, పట్టిసస్థానం, పుండరీకాద్రి, కుమారారామం,కుక్కుటేశ్వరం,కోటిపల్లితీర్థం, బ్రహ్మసంవేద్య విష్ణుసంవేద్యాలూ మొదలైన తీర్థక్షేత్రాలన్నీ శ్రీనాథునికృతిలో రసాకృతులతో ప్రత్యక్ష మౌతాయి. భీమేశ్వర స్వామితోపాటు గ్రామ దేవతల్ని-వారి ఉత్సవ విశేషా లను కూడా శ్రీనాథుడు శ్రద్ధలో వర్ణించాడు. వేశ్యల విలాసాలనుండి వేల్పుల మాహాత్మ్యాల వరకూ తెలుగువారి ఐహికాముష్మిక జీవిత చిత్రాన్ని భీమేశ్వర పురాణంలో శ్రీనాథుడు వర్ణరంజితంగా చిత్రించాడు. సమకాలీన జీవిత సత్యాల కది సరస వ్యాఖ్యానం.

భీమేశ్వరపురాణం శ్రీనాథుని స్వతంత్రకృతి అనీ, ఆయన రచనమే సంస్కృతీకరింపబడి స్కాందంలోని కెక్కిందనీ పండితులు బలంగా నమ్ము తున్నారు. అది నిజం కావచ్చు. ఆంధ్రపురాణాన్ని అమర భారతికి అర్పించిన అఖండ గౌరవం శ్రీనాథుని ఆంధ్రాభిమానానికి అక్షరనీరాజనం!

## 21

త్ర్యంబకాచల శిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్త భూమి దటిసి
మలఁగి దండకవనీ మధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి
పట్టిస శ్రీ వీరభద్రేశు సేవించి
తిలసోమనాథు మందిరము డాసి
యేచి యనంత భోగేశ్వర స్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖ తీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. భీ. 3.21

ఇది గోదావరీ జల ప్రవాహప్రశస్తి. పుట్టినింటినుండి బయలు దేరిన పురంధ్రి మెట్టినింటికి కల్యాణయాత్ర చేసి నట్లుంటుంది ఈ సీస గమనం. గౌతమీనది తెలుగు వారి పెద్దాడబడుచు, దక్షిణాన దర్శన మిచ్చే గంగమ్మతల్లి. ఆంధ్ర భారతి ఆమె అంకపీఠిలో ఆవిర్భవించింది. 'వార్ధు లేడింకిని వలపు వనితలా' ఆమెను భావిస్తాడు శ్రీనాథుడు.

పై పద్యంలో అలంకార మున్నట్లుగానే కనపడదు. కాని, కౌగిలించె ననే క్రియను వాడటంతో గోదావరి ప్రౌఢవనితగా రూపుకటుతుంది. రూపకాలంకారాన్ని సాగంగా నిరూపించకుండానే రూపనిష్పత్తిని సాధించే నేర్పు ఈ పద్యంలో ఉంది. ఎఱ్ఱన్న ఇటువంటి ఆర్థిక చమాత్కారాల నెన్నో చేశాడు. శ్రీనాథుడు సార్థకంగా వాటిని కొల్లగొట్టాడు.

## 22

కుక్షి ప్రోద్భవ నిష్ఠుర క్షుభిత దుష్ప్రోక్తాంధకారంబునం
జక్షు ర్లెండును జిమ్మచీకటులుగా సంరంభశుంభద్గతిన్
భిక్షాచ్ఛాత్రులు భీతినొందఁ గడు నుద్రేకించి హాట్టంబునన్
భిక్షాపాత్రము ఱాతిమీఁద శతథా భిన్నంబుగా వైచితిన్. భీ. 2.102

వ్యాసుడు కాశిలో వారం రోజులు భిక్షాన్నం దొరక్క ఆకలితో అలమటించాడు. అష్టమదివసాన ఆయన ఆ కష్టాన్ని భరించలేకపొయ్యాడు. అన్నపూర్ణకు ఆవాసమైన కాశిలో అన్నం పుట్టలే దా పురాణకర్తకు. కరకరమని ఆకలి ప్రేవుల్ని కొరికేస్తుంటే చురచురమని ఆయన చూపుల్లో కోపం మండు కొచ్చింది. శిష్యు లా క్రోధమూర్తిని చూచి కంపించిపోయారు. భిక్షాపాత్రను వేయివ్రక్క లయ్యేలా రాతిమీద కొట్టాడు; కాశిని శపించటానికి కమండలోదకం చేపట్టాడు. అన్నపూర్ణ అడ్డంవచ్చి ఆయన ఆగ్రహాన్ని అదలించింది; అన్నానికి రమ్మని పిలిచింది. అమృతం లాంటి ఆ ఆహ్వానానికి వ్యాసుని కళ్లల్లో ఆశాజ్యోతి మొలకెత్తింది. ఆయన ఒక్కడే కాదు ఆకలికి గురి అయింది. వరుగుతో ఎండే దాగరల్లాగా మున్నూరుమంది శిష్యులు ఉపవాసాలతో శోషిల్లి పోతున్నారు. కన్నకొడుకులకన్నా మిన్నగా చూచుకొనే ఆ చిన్నవాళ్లను వదలిపెట్టి అన్నానికి తా నొక్కడే ఎలా వెళ్తాడు? అడగంది అమ్మైనా పెట్టదని ఇలా అర్థించాడు.

"తల్లీ! యిన్నిదినాల కేనియు సుధాధారా రసస్యంది యై
యుల్లంబు న్సుఖియింపఁ జేయు పలు కెట్లో వింటి మిప్పేటిలోఁ,

బెల్లాఁకొన్నతనాన నే నొకడనే భిక్షానకు న్వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ ? నిజం బేర్పాటుగాఁ జెప్పుమా !"

"ఈవు పెట్టిన భిక్ష మేమిందఱమును
బంచుకొని చేయువారము ప్రాణరక్ష
నాతి ! యందఱివియును బ్రాణములు కావె ?
నాదియే ప్రాణమని వత్తునా ; భుజింప ?"

గురువుకు శిష్యులే సంతానం. పిల్లల నోళ్లు కొట్టి తాను పావుకు తినలేదు తండ్రి. భిక్ష నర్థించిన మహర్షికి వంటా వార్పూ లేకుండానే పంచభక్ష్య పరమాన్నాలు వడ్డించింది విస్తళ్లల్లో. అందరూ విస్తుపోయి విం దారగించారు. అంతలో విరూపాక్షుడు వేడి చూపుల్తో ప్రత్యక్ష మయ్యాడు. కాశిని శపింపబోయిన వాస్యుణ్ణి పద తిట్టాడు, ఊరు వదలి పొమ్మని బహిష్కరించాడు.

"పోక నడగొట్టితేనియు, రాకింతుఁ జుమీ మొగంబు రాచట్టుపయిన్
శ్రీ కాశిక నిందించిన, నీ కింతట నేలపోవు నీచచరిత్రా" అని నిష్ఠురంగా

బెదిరించాడు. వ్యాసునికి శ్వాస ఆగినంత పనైంది. పరమేశ్వరునికి ప్రణామం చేసి ప్రయాణం సాగించాడు. భర్గుడు భయంకరంగా శాసించినా భవాని తల్లిగా చల్లని మాటలు పలికింది - దోవ చూపి దీవించింది.

"వెఱపకు మోకుమార ! పదివేల విధంబుల నైన నిన్ను నే
మఱవ మతేడకుం జనుట మాని సుఖంబున దక్షవాటికిన్
దుఱఁగలి గొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱ లేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్."

ఉత్తరాన కాశిలో విశ్వేశ్వరుడు ఉద్ధతమూర్తి, దక్షిణాన దాక్షారామంలో భీమేశ్వరుడు దాక్షిణ్య మూర్తి. వ్యాసుని మనశ్శుద్ధిని పరీక్షించటం ఈ కథా తాత్పర్యం.

వ్యాసుడు కాశిని బాసిన ఘట్టం భీమఖండంలో పఠితకు రోమాంచం గలిగించే రసవత్తర సన్నివేశం. ఈ కథలో కీలకం వ్యాసుని క్రోధావిర్భావం. క్రోధంవల్ల జనించేది రౌద్రం. రౌద్రం వలన జనించేది కరుణం. వ్యాసుని క్రోధం విశ్వేశ్వరుని రౌద్రోద్రేకానికి కారణం. దానివల్ల వ్యాసునికి కలిగింది శాపశోకం, కాశీ వియోగతాపం. జనకజన్యరసాల సంవిధానం ఈ ఉపాఖ్యానశిల్పం. కారణం వేరైనా వ్యాసుని లాగానే కాశిని బాసి దాక్షారామం చేరిన వాడు అగస్త్య మహర్షి. ఇరువురికీ కాశీవియోగ దుఃఖం సమం. ఆర్ద్రమైన ఆర్షశోకం ఈ పురాణంలో

కరుణగా జాలు వారింది. భీమఖండంలో లాగానే కాశీఖండంలో కూడా ఈ కథ వస్తుంది. కాశీఖండంలో అన్నపూర్ణ కన్నతల్లిగా పలుకరిస్తుంది.

"ఓ మునీశ్వర వినవయ్య ! యున్న యూరు (
గన్నతల్లియు నొకరూ పన్నరీతి
యటు విశేషించి శివుని యర్థాంగ లక్ష్మి
కాశి యివ్విటిమీద నాగ్రహము దగునె"

"ఉన్న ఊరూ కన్నతల్లీ ఒకటి"-స్వీయరాష్ట్రానికి చేటుచేసుకోవటం కూర్చున్న కొమ్మను నరుక్కోవటం. తెలుగువారు నేటికీ గుర్తుంకోవలసిన త్రికాలసత్య మిది!

## 23

మది శంకింపకు మన్న ! మావలని ప్రేమస్నేహ వాత్సల్యాసం
పద పాటింపకు మన్న ! నాలుకతుదిన్ బంచాక్షరీ మంత్రముం
బదిలం బొప్ప( బఠింపు మన్న ! పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సుమ్మన్న ! యనుంగునందన ! సిరాలా ! వీరశైవవ్రతా !

హర. 2. 116

సిరియాళుణ్ణి చంపి మాయజంగానికి వండిపెట్టడానికి పూనుకొంటున్న సందర్భంలో తల్లిదండ్రు లా కొడుకుతో పలికిన మాట లివి. శివభక్తి ఒక వైపూ, కన్నతీపి ఒకవైపూ అడకత్తెరలా యెదనంతా ఒత్తుతుంటే అన్నా, అన్నా ! అని ఆవుల్లా అరిచా రా ఆలుమగలు. కొడుకు కంఠంమీద కత్తి పెట్ట బోయేముందు కన్నీరుతో తడిసి జారిన మాట లివి. కన్నవాళ్లే కసాయివాళ్లయి నారని ఆ పసికందు అనుకోవచ్చు; తల్లిదండ్రుల్ని వదలిపోవలసి వచ్చిందే అని ఆ పిల్లవాని హృదయం తల్లడిల్లవచ్చు; పరమపదించేటప్పుడు పంచాక్షరి జపిస్తే మోక్షపదం లభించవచ్చు-శంకానివారణం, మోహత్యాగం, మంత్రజపం, బ్రహ్మజ్ఞానం-ఇవి మోక్షసిద్ధికి సోపానాలు. గుండెను పిండి చెపుతున్న మాటల్లో గోప్యమైన తత్త్వార్థాన్ని సాధించాడు శ్రీనాథుడు. దానివల్ల మొదట కలిగేది రసానందం, ఆ పైన జ్ఞానానందం.

హరవిలాసంలో సిరియాలుని కథ మొదటిది. ఆ పైన గౌరీకల్యాణం, దారుకా వనవిహారం, హాలాహలభక్షణం, కిరాతార్జునీయం కథ లున్నవి. హర విలాసం శివలీలలు చెప్పే కథాకావ్యం. పాల్కురికి సోమనాథుని బసవపురాణంలో

సిరియాళుని కథ ఉంది. కాళిదాసుని కుమారసంభవంలో గౌరీకల్యాణగాథ ఉంది. భారవికావ్యంలో కిరాతార్జునీయ కథ ఉంది. శివపురాణాల్లో మిగిలిన కథ లున్నాయి. శ్రీనాథుడు వాటిని ఎడనెడ అనుసరిస్తూ స్వతంత్రరచనం చేశాడు. బాల్యమిత్రుడు అవచిప్పయ్య సెట్టి శైవుడూ, సిరియాళ వంశస్థుడూ కావటం వల్ల హరవిలాసం పేర ఆ కథల్ని సంవిధానం చేసి ఆయనకు అంకితంచేశాడు.

వీరభక్తికీ వాత్సల్యానికీ యేర్పడిన సంఘర్షణం సిరియాల చరిత్రలో జీవం. వీరశైవవ్రతంలో భక్తులు తమ సర్వస్వాన్నీ శివార్పణంగా భావిస్తారు. జంగముణ్ణి సాక్షాత్ సాంబశివునిగా భజిస్తారు. శివునిముందు శరీరాభిమానం త్యాగంచెయ్యాలి; వీరకర్మతో వ్యామోహాన్ని జయించాలి-అన్నది కథాతత్త్వం.

## 24

'ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వెంతకా
లానకు నీకుఁ బెండ్లియ ఫలం బగునేని విచారమేల స
న్మానముతోడ నన్ను మునిమాన్య వివాహముగమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్'. హర.4.25

గౌరీకల్యాణకథలో కపటబ్రహ్మచారి కుహనావాదం కమనీయఘట్టం. కాళిదాసు కావ్యం వలన దాని కాప్రసిద్ధి వచ్చింది. కవిసార్వభౌముడు కవి కులగురువు మార్గాన్ని అనుసరించినా స్వతంత్రరచనం కూడా చేశాడు. అటు వంటి పద్యాల్లో ఇది ఒకటి. నన్నయ్య ఇలాంటి పద్యమే ఒకటి వ్రాశాడు కచ దేవయాని కథాఘట్టంలో.

'నీవును బ్రహ్మచారివి వినీతుడ వేనును కన్యకన్ మహా
దేవ కులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్ను పరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయఁ జేయుము నాకుఁ బ్రియంబు నాపుడున్'

(ఆది. 3. 129)

అది నాయిక చెప్పింది, ఇది నాయకుడు పలికింది. నన్నయ ఎత్తుగడతో పద్యం నడిపినా శ్రీనాథుడు శిల్పంతో వన్నె పెట్టాడు. "తరళేక్షణ!" అన్న సంబుద్ధిలో నాయకుని రతిభావం, నాయిక ముగ్ధమోహనత్వం ధ్వనిస్తున్నాయి. 'ఎంత కాలానకు' అనటంలో యౌవనం కాలవిలంబనాన్ని సహింపదని సూచన. తపోభి

మానం వీడి సన్మానాన్ని ప్రకటింప మనటం చమత్కారం. మునిమాన్యు డన టంలో ఆమెకు తగినవరు డనే సూచన. వివాహము కమ్ము, లెమ్ము అని తొందర పెట్టటంలో ఉన్ముఖీకరణమూ ఉంది, 'అలస్యా దమృతం విష' మ్మనే హెచ్చరికా ఉంది. తపంలో సగ మిచ్చెద ననటం భావికాలంలో అర్ధ శరీరా న్నివ్వటానికి నాంది. పెండ్లికోసం ఎన్ని తపస్సులు చేపట్టినా ఆమె పెళ్లి కాని పిల్ల. ఆయన ఎన్ని వేషాలు వేసినా కన్నెకోసం వచ్చిన వటువు. పైకప్పులు పోతే అసలు రూపాలు అవి; 'ఏనును బ్రహ్మచారి-నీవును కన్యవు' అన్నప్పుడు సన్నివేశగతమైన భావం సాధారణీకరణం చెందుతుంది; రసోన్ముఖ మౌతుంది.

పెళ్లికానిబావ మరదలుపిల్లతో సరసా లాట్టానికి నేటికీ ఈ పద్యం ప్రేమసూత్రంలా పనికొస్తుంది!

## 25

జలధర మంతయై కదటి చందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి నేరెడుపండును బోలె నుండయై
కలశపయోధి మంథనముఖంబునఁ బుట్టిన యమ్మహాహాలా
హాలము క్రమంబున న్శివుని హస్తసరోరుహ మెక్కెఁ జుక్కగన్.

హర. 6.68

క్షీరసాగర మధన సమయంలో లోకభయంకరమైన హాలాహలం పుట్టింది. జగత్కుటుంబి యైన పరమేశ్వరుఁడు లోకకల్యాణార్థం దానిని మ్రింగటానికి చెయిసాచాడు. ఫణిధరుని ప్రభావంవల్ల హాలాహలం క్రమంగా కుంచించుకు పోయింది. జగద్వ్యాపి యైనది మొదట జలధర మంత అయింది. అది క్రమంగా ఏనుగంత - ఏదుపందంత - కోకిలాకారమంత - నేరెడు పండంత - చివరకు నక్షత్రమంతగా మారింది. అది అంగిట్లో నిలిచి ఆవగింజంత మచ్చగా మిగులు తుంది. ఈ పరిణామాలంకారం వస్తువును అలంకరిస్తూ అద్భుత రసాన్ని ఆవిర్భవింప చేస్తున్నది. 'ఇంతింతై వటు డింతయై...' అన్న పోతన పద్యం దీనికి తిరుగవేత.

శ్రీనాథుని ఊహలో ఎంత ఎత్తుందో ఉక్తిలో అంతశక్తి ఉంది. 'కలశప యోధి...' అన్నపద్యపాదం హలాహల రూపగౌరవాన్ని సూచిస్తున్నది. 'శివుని హస్తసరోరుహము' అన్నసమాసం ఆయన కోమల హస్తాన్ని రూపిస్తున్నది.

'చుక్కఁగన్' అన్న మూడక్షరాలు హలాహల లఘుత్వాన్ని పట్టియిస్తున్నవి. ఆపదంలోని రెండు గురువుల మధ్య ఒక లఘువు - శివుని హస్తంలోని చిన్న మెత్తు విషం లా కనిపిస్తున్నది. చూచే కన్ను లుండాలి కాని శ్రీనాథుని రచనలో ప్రత్యక్షరం కాంతిమంత మైన ఒక నక్షత్రం. ప్రతి పద్యం ఒక పాలబాట!

భీమఖండంలో కూడా యీఘట్ట ముంది. శివుడు విషఘుటికను మ్రింగిన చప్పుడు కూడా విన వచ్చే టట్లు శ్రీనాథుడు కందంలో అందంగా చెప్పాడు చూడండి :-

"కటక మగు విషము విషధర
కటకంబగు కేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస
ఘుటికయునుం బోలె శివుఁడు గుటుకున మ్రింగెన్"

## 26

చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ మీ విపిన మెక్కఁడ నీసుకుమారతాగుణం
బెక్కఁడ ఘోరవీరతప మీ యెలప్రాయమునందుఁ జేయు నే
యక్కట! యెవ్వడైఁన నకృతాత్ముఁడఁ వీ వొకరుండు దక్కఁగన్.

హర.7.16

పాశుపతాస్త్రసిద్ధికై పార్థుఁడు ఇంద్రకీలాద్రిపై తపస్సు ప్రారంభించాడు. సంవత్సరం గడించిది. సహస్రాక్షుడు కొడుకును పరీక్షించటానికి వృద్ధ బ్రాహ్మణవేషంతో వచ్చాడు. తపోవిఘ్నకారులైన మాటలు మొదలుపెట్టాడు. మాటలు కృతకమైనా తండ్రి మనసు మెత్తన. ఆయన చిత్తవృత్తి మెత్తని మాటల్లో వినిపిస్తుంది. 'చక్కని' 'అక్కట' అనే ద్విత్వకకారాక్షరప్రాసం వల్ల ఇంద్రుని మనసులోని కటకట వ్యక్త మౌతుంది. చక్కగా, చల్లగా, సుకుమారంగా నడచిన శ్రీనాథుని పద్యసుందరి ఇది.

భావానికి తగినట్లుగా ఛందోగమనం, విభావానికి తగినట్లుగా అక్షర గ్రథనం కవి చిత్తశుద్ధితో చేస్తే సమాంతర ఘట్టాలలో సామ్యం ఉన్న పద్యాలు సాక్షాత్కరిస్తుంటాయి. అందుకు శ్రీనాథుని రచనలో సహస్రసాక్ష్యాలు కన పడతాయి. వాటిని సహృదయులు గమనించాలి. ఉదాహరణానికి ఒక్క పద్యం! హిమవంతుఁడు పార్వతితో అన్నది.

"ఎక్కడ లేరె వేల్పులు సమీప్సిత దాతలు ముద్దుఁ గూన! నీ
వెక్కడ? ఘోరవీర తప మెక్కడ? యీ పటు సాహసిక్యముల్
తక్కు; శిరీష పుష్ప మవధాన పరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా?
హర. 4.6

కాళిదాసు శ్లోక భావానికి చికిలి పెట్టిన పద్య మిది. భావం ఎవరిదైనా పద్యం శ్రీనాథునిది! ఈ ఫణితిని ప్రబంధ కవులు బహుథా అనుసరించారు.

## 27

చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన
గండ్రగొడ్డలి నిశాగహనలతకుఁ
గార్కొన్న నిబిడాంధకార ధారాచ్ఛటా
సత్త్రివాటికి వీటిహోత్రజిహ్వా
నక్షత్ర కుముదకాననము గిల్లెడుపొంటె
ప్రాచి యెత్తిన హస్తపల్లవాగ్ర
మరసి మింటికి మంటి కైక్య సందేహంబుఁ
బరిహరింపఁగఁ బాల్పడ్డ యవధి
సృష్టి కట్టెట్టు తొలుసంజ చెలిమికాఁడు
కుంటి వినతామహాదేవి కొడుకుఁగుట్టు
సవితృసారథి కట్టెట్టుచాయ వేలు
పరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున. కాశీ.1.121.

కాశీఖండంలోని అరుణోదయ వర్ణన మిది. కాశీఖండానికి మూలం స్కాందపురాణం. మూలాన్ని ముందు పెట్టుకొని ముక్కునూటిగా అనువదించడు శ్రీనాథుడు. ప్రసిద్ధ ప్రాచీన కవుల గ్రంథాల్లోని అపూర్వభావాలను అవసరాన్ని పట్టి అనువాదంలోకి దిగుమతి చేసుకుంటాడు. మూలభావాన్ని సరస్కరిస్తాడు ముగ్ధ మోహనంగా ఆవిష్కరిస్తాడు. ప్రభాకర వర్ణనానికి మయూరుని సూర్య శతకం ప్రసిద్ధి. అందులోని "శాతః శ్యామాలతాయాః పరశు రివ తమోరణ్య వహ్నేరివార్చిః" అన్న శ్లోకాన్ని ఆధారంగా చేసికొని, దాన్ని చిఱుసాన పట్టి చికిలిచేసి పద్యాన్ని నిర్మించాడు.

కాశీఖండం వారణాసి క్షేత్ర మాహాత్మ్యన్ని వర్ణించే స్థలపురాణం. స్థల దేవ తీర్థ మహిమాభి వర్ణనమే అందులోని వస్తువు. పురాణంలో రసదృష్టి కంటె పుష్కలమైన వర్ణనదృష్టి కనబడుతుంది. విసుకు కలగని వైవిధ్యంతో వర్ణన చేయటమే శ్రీనాథు డిందులో ప్రదర్శించిన ప్రజ్ఞ. అగస్త్యుడు వింధ్యను దాటి వచ్చుట, శివశర్మోపాఖ్యానం, కళావత్యుపాఖ్యానం, గుణనిధి కథ, వ్యాసుడు కాశిని బాసిన కథ - మొదలైన ఉపాఖ్యానాలు కాశీఖండంలో కర్పూరఖండాల్లా ఉన్నాయి. శ్రీనాథు డాకర్పూరఖండాలకు కస్తూరిని జతకలిపి గుబాళింప చేశాడు. కాశీఖండకథల్లో కెల్లా గుణనిధి కథ గుణంలో గొప్పది. పతితుడు పరమేశ్వరుణ్ణి జేరే సులభోపాయాన్ని సూచించటమే ఈ కథాకల్పన రహస్యం.

కాశీఖండంలో కథల కెంత ప్రాధాన్య ముందో వర్ణనల కంత ప్రాముఖ్య ముంది. శ్రీనాథుని వర్ణనలకు మూలాలు కనిపెట్టాలంటే గీర్వాణ వాఙ్మయాన్ని అన్నిమూలలా గాలించాలి.

## 28

కొల్లాయుంచితిఁ గోక చుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగా
జల్లాయంబలిఁ ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మి ! దయలేదా నేను శ్రీనాథుఁడన్.

శ్రీనాథుని జీవితవిశేషాలూ, సమకాలీన సమాజంలోని నలుపుతెలుపులూ ఆయన చాటువుల్లో చక్కగా ప్రతిబింబించాయి. అనుభవాలూ, అభిరుచులూ, అదలింపులూ, హాస్యప్రసంగాలూ, కనకాభిషేకాలూ, కన్నీటిమాటలూ అన్నీ ఆయన ఆశుధారతో అమరత్వాన్ని సాధించాయి. ఆంధ్ర కర్ణాట ప్రాంతాలన్నీ ఆయనకు విహారరంగాలైనవి. విహారాలతో పాటు ఆయన రుచిచూచిన ఆహార పదార్థాలు కూడా ఆశుపద్యాల్లో అపూర్వరుచుల్ని అందించాయి. కొండవీటిలో, రాజమహేంద్రవరంలో విందులు కుడిచిన కవిరాట్టు దేశాలు పట్టి తిరిగినప్పుడు నానాతిండ్లూ తిని నానాబాధలూ పడ్డాడు. వేషాలు మార్చాడు, విభులను దర్శించాడు, వాదాలు చేశాడు, విజయాలు సాధించాడు. విజయ నగర సామ్రాజ్యాన్ని దర్శించి ప్రౌఢదేవరాయల దర్బారులో ప్రవేశాన్ని అర్థించాడు. ఆలస్యమైతే ఆగ్రహించాడు. కొల్లాయి కట్టినా, కోకచుట్టినా, కూర్పాసం తొడిగినా, వెల్లుల్లి తిన్నా, తిలపిష్టం మ్రింగినా, చల్లా అంబళ్లు త్రాగినా రాజదర్శనం

కాలేదు. రాజ్యలక్ష్మిని నిష్ఠురమాడాడు. రాజునుకూడా వదలిపెట్టలేదు. ఆగ్రహంతో అర్జీ పంపాడు!

'డంబుసూపి ధరాతలంబుపైఁ దిరుగాడు, కవి మీఁద గాని నాకవచ మేయ దుష్ప్రయోగంబులు దొరకొని చెప్పెడు, కవిశిరస్సునగాని కాలుసాప సంగీతసాహిత్యసరసవిద్యల నేర్చు, కవుల బొమ్మలు గాని కాల్చి విడువ చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు, కవినోరుగాని వ్రక్కలుగఁ దన్న జంట కవులకు బలువైన యింటి మగడ, కవుల వాదంబు వినవేడ్క గల్గెనేని నన్ను బిలిపింపు మాస్థానసన్నిధికిని, లక్షణోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర!'

కవితలో అర్జీలు కవిసార్వభౌముడే ప్రారంభించినట్లున్నాడు. అది నిన్న మొన్నటి తిరుపతి కవులవరకూ సంప్రదాయంగా సాగివచ్చింది. ప్రౌఢదేవరాయల సభలో డిండిమభట్టును వాదులో ఓడించి కవిసార్వభౌమ బిరుదంతోపాటు కనకాభిషేక గౌరవాన్ని పొందాడు. ఆగ్రహించిన నాల్కతోనే ప్రభువును అభినందించాడు.

ఆగ్రహానుగ్రహాలకు ఆశుకవిత ఒక అలంకారం!

## 29

దీనారటంకాల తీర్థ మాడించితే
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషణ క్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
పలుకు తోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
నెటుల మెప్పించెదో నన్ను నిఁకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణ నికురంబ! శారదాంబ!

సర్వజ్ఞ సింగభూపాలుడు సంస్కృత సాహిత్యవేత్త. ఆయనను మెప్పించటం వాణిని మెప్పించటమే! శ్రీనాథుడు శారదావరప్రసాదుడు. సమయాన్ని

కా చల్లని తల్లి సహకారంగా నిలిచే ఉంటుంది-కనకాభిషేక సమయంలో, కావ్య రచనావ్యాసంగంలో. అస్త్రాన్ని ప్రయోగించేటప్పుడు అధిదేవతను ఆవాహనం చేయాలి. ఆ ఆచారం ప్రకారం అబ్జభవుని రాణిని ఆరాధించాడు శ్రీనాథుడు. సర్వజ్ఞుణ్ణి దర్శించాడు - ఆశువుగా కీర్తించాడు.

"సర్వజ్ఞ నామధేయము, శర్వునకే రావుసింగ జనపాలునికే
యుర్విన్ జెల్లును ; దక్కొ-రు, సర్వజ్ఞు డనుట కుక్క-సామజ మనుటే".

శత్రుమిత్రుల కిరువురికీ సమ్మోదాన్ని కల్పించే కాకువును కీలకంగా నిలిపాడు కందంలో. "జనపాలునికే యుర్విన్ జెల్లు"నంటే రాజుకు సమ్మానం ; "జన పాలునికి ఏ యుర్విన్ జెల్లు" నంటే అవమానం. ఆయన వాక్కు-కు రెండు వైపులా పదునున్నది. ఈర్ష్యాపరులైన ఆస్థానకవులు శ్రీనాథుని వెక్కి-రిస్తూ సమస్య నిచ్చారు. పండితుల మనసు కెక్కే-టట్లు శ్రీనాథుడు పూరించాడు.

తక్క-క రావుసింగ వసుధావరుఁ డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కు-లలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానుఁ బెం
పెక్కి-న కామధేనువు శచీంద్రుని నెన్నెదు భట్ట! దిట్టవై
"కుక్క-వొ!నక్క-వో! ఫణివొ! కోతివొ!పిల్లివొ! బూతపిల్లివో" (సమస్య)

ఆశువుగా చెప్పినా అన్వయం ఉంది ; కర్ణుడూ కుక్కా- విశ్వాసపాత్రులు ; దధీచి ఎముకల్ని ఆయుధాలుగా చేసినాడు; నక్క-కు ఎముకలు రుచి; ఖేచరుడంటే ఫణికి భయం ; కల్పతరు వంటే కోతికి ఫలాశ ; కామధేనువు పాలు పిల్లికి పాయసం. శచీంద్రునికీ బూతపిల్లికీ అర్థసామ్యంఉంది. పట్టుపట్టి వ్రాసిన పద్యంలో కూడా ఇంతప్రౌఢి ఉండదు!

## 30

అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దాక్షారామ పురీవిహార వర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు నవ్వాసనల్.

కవితకూ, కస్తూరికీ మారుపేరు శ్రీనాథుడు. కవిత కెన్నడూ కరం చాచి ఎవ్వర్నీ అడగలేదు కాని కష్టదినాల్లో తెలుగురాయణ్ణి కస్తూరిభిక్ష కోరాడు. దారిద్ర్యంలో భిక్షాటనం చేసినా దారుకావనంలో భిక్షావృత్తిని చేపట్టిన శ్రీకంఠు నిలా కనపడతాడు శ్రీనాథుడు. ఈశ్వరుడు భిక్షపెట్టినవారికి ఐశ్వర్యం యిస్తే ఈ కవీశ్వరుడు అక్షరమైన కవితాయశస్సును ప్రసాదించాడు.

ధాటీ ఘోటకరత్న ఘట్టన మిళద్రాఘిష్ఠ పల్యాణ ఘం
టాటంకార విలుంఠలుంఠన మదోన్మత్తాహితక్షోణి భృ
త్కోటీరాంకిత కుంభినీధర సమిత్కూటాటవీఝూట క
ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగాధీశ! నీకు బ్రహ్మాయువౌ!

తెలుగురాయ డెవరో మన కిప్పటికీ సరిగా తెలియకపోయినా, శ్రీనాథునికవితా పయస్సులకు పాత్రమై యశస్సును గడించాడు. ఈ పద్యానికి ఆ ప్రభువుకూ బ్రహ్మాయువు!

## 31

వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుడు తల్లి పోతురా
జారయ కాలభైరవుఁడు నంకమశక్తియు నన్నపూర్ణయున్
గేరెడి గంగధార మడుగే మణికర్ణికగాఁ దెలుంగు నీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి వారికిన్.

పలనాటియుద్ధం తెలుగుభారతం. కారెమపూడి కురుక్షేత్రం. బాలచంద్రుడు అభిమన్యకుమారుడు. ఆ వీరభూమిలో విహరిస్తున్నప్పుడు శ్రీనాథుని కవితలో అక్కడి ఆంధ్రపౌరుషం ఆశుకవిత్వంగా జాలువారింది. అప్పటికీ ఆయనకు తృప్తికలగలేదు. దేశిభారతాన్ని దేశీయవృత్తంలో కీర్తించాడు. బాలచంద్రునివీరగాథను మంజరీద్విపదలో మనోహరంగా గానంచేశాడు. కోళ్లపందాల నుండి కొదమవీరుల యుద్ధంవరకూ తెలుగువారి నెత్తు రుడుకెత్తేలా తెలుగు కృతిని నిర్మించాడు. క్రీడాభిరామంలో పల్నాటివీరులకు గుళ్లు కట్టించాడు. పల్నాడు ఎంత వీరక్షేత్రమో అంత పుణ్యక్షేత్రం. కాశీఖండ కర్త కారెంపూడిని కాశిగా గుర్తించాడు; దాని వాసిని దిగంతాలకు గుప్పించాడు.

## 32

గ్రామము చేత నుండి పరికల్పితధాన్యము లింట నుండి శ్రీ
రామకటాక్షవీక్షణ పరంపరచేఁ గడతేరెఁగాక; మా
రామయమంత్రి భోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు? నా
స్వామి యెఱుంగుఁ దత్కబళచాతురి తాళఫలప్రమాణమున్.

శ్రీనాథుడు ప్రశంస నెంత ప్రౌఢంగా చేస్తాడో పరిహాసాన్ని అంత సున్నితంగా చేస్తాడు. రామయమంత్రి ఎవరో బావవరసవాడై ఉంటాడు. అగ్రగహారాన్ని అన్నపుముద్దలతో హారతికర్పూరం చేసుకున్న ఆహారజీవి. ఆయన పుణ్యమంతా శ్రీనాథుని పద్యంలో ఫొటో దిగటమే. చాటు కవితా మంది రంలో ఆ చిత్రం చెరిగిపోదు.

బావమరదళ్లేకాదు, భాగ్యవంతులూ, చివరకు భగవంతుడు కూడా శ్రీనా థుని పరిహాసానికి పాలైనారు. 'అయ్య నీవు చతుర్భుజావతారుడవన్న,దమ భుజా దండ పార్శ్వముఁలఁ జూతు' రట సంస్కారంలేని సంపన్నులు, (శి.మా 2.97) అపండితుల నాశ్రయించాలంటే ఆయన కెంత అసహ్యమో ఆ పద్యం చెపుతుంది.

పల్నాటి సీమలో మంచినీళ్లు కరవైనప్పుడు శివుణ్ణి నిందాస్తుతి చేస్తాడు. నిందాస్తుతిలో పరిహాసంకూడా పవిత్రమౌతుంది.

'సిరిగలవానికిఁ జెల్లును, తరుణులు పదియారువేలు తగఁ బెండ్లాడన్
తిరిపమున కిద్దరాండ్రా!, పరమేశా ! గంగ విడుము పార్వతి చాలున్'

ఇందులో సిరిగలశ్లేష ఉంది, పురిగల గడుసుదనం ఉంది. శ్రీనాథుని చాటు వుల్లో పలనాటి సీమ మీది పద్యాలకు ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. తెలుపు నలు పుల నాటి కలరూపును కళ్లకు కట్టినట్లు కవితలో చిత్రించా డాకవినాథుడు.

కవితలో మెచ్చు వచ్చినా మచ్చ వచ్చినా అచ్చుపోసినట్లు నిలిచిపోతుంది.

## 33

ద్రాక్షాపానక ఖండశర్కలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాల కలమాహారంబు నిశ్శంకతం
గుక్షుల్నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్.భీ. 2.142

రామయమంత్రి రసిక భోజనం చేయనందుకు శ్రీనాథుడు పరిహసిం చాడు. రసికభోజన మంటే ఏమిటో ఈ పద్యంలో చెప్పాడు. విందుప్రసక్తి వచ్చినప్పుడెల్లా కావ్యాల్లో చవులూరించే సమగ్ర భోజనాన్ని శ్రీనాథుడు వర్ణిం చాడు. తెలుగువారి తిండి దినుసులూ, వంట వార్పులూ ఈయన కావ్యాలో ఎన్నోసార్లు వినపడతాయి. కలమాన్నంతో పాటు కఱకుట్లనూ కమనీయంగా వర్ణించిన కవి శ్రీనాథుడు.

శ్రీనాథుని కవితాపాకం వడ్డించిన విస్తరి. ఆరగించటానికి తగినంత జీర్ణ శక్తి ఉండాలి! భుక్తి లేనిదే శక్తి లేదు; శక్తి వినా రక్తి లేదు.

## 34

కవిరాజు కంఠంబు కౌఁగిలించెను కదా
పురవీథి నెదురెండ బొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు ?

జాతి కింత కవితా పాకాన్ని ప్రసాదించిన కవిసార్వభౌమునికి అన్నమే కరువైంది. నూకలకోసం నేలను నమ్ముకున్నాడు. కలాన్ని ప్రక్కకు పెట్టి హలాన్ని పట్టాడు. కాలం అతన్ని కాటేసింది. ఒడ్డెరాజుల యేలుబడిలో గడ్డు రోజులు దాపురిల్లాయి. గతవైభవమంతా హుతమై పోయింది. అండ నిలిచే దండనాధుడు లేడు. ఆదరించే ప్రభువు లేడు. పలకరించే ప్రాణి లేదు. నల్ల గుండు బరువుకు శ్రీనాథుని దేహం గుల్ల యై పోయింది. సూర్యుడు చరమాద్రి కెక్కాడు - స్వర్గద్వారాలు మెల్లగా తెరుచు కుంటున్నాయి - కవికంఠంనుండి చరమగీతం వినిపించింది.

## 35

కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరము లేరాయ డిచ్చుఁ

గై లాసగిరిఁ బంటమైలారువిభుఁ డుండె
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు ?
రంభఁ గూడెఁ దెలుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు ?
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తి కలదు ?
భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిక నుండఁ గష్ట మనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గు రనఁగఁ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

శ్రీనాథుని చివరి శ్వాసకూడా సీస పద్యంలో ఛందోమయంగా వినిర్గత మైంది. భూలోకంలో లేని భోగాలను స్వర్గలోకంలో సాధిస్తానని వెళ్లాడు శ్రీనాథుడు. ఆయన అమరలోకంలో అడుగుపెడితే దివిజ కవివరుని గుండె జల్లుమంటుందిట. ఆయనతో సంస్కృతంలోనే వాదిస్తాడేమో శ్రీనాథుడు. ఆయన డిండిమాన్ని గూడ పగులకొట్టిస్తాడేమో! స్వర్గంలోకూడా స్వర్ణాభిషేకాన్ని చేయించుకుంటాడేమో-కవిసార్వభౌమ బిరుదాన్ని గడిస్తాడేమో-ఏమో!-ఏమైనా దివిజరాజు సభలో కూడా తెలుగు వాణికి గద్దె దొరుకుతుంది. శ్రీనాథు దక్కడ కూడా 'దేశభాషలందు తెలుగు లెస్స' అని ప్రకటిస్తాడు-

"జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందు తెలుఁగు లెస్స
జగతి తల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడుబిడ్డ మేలు గాదె ?" (క్రీడా. 37)

ఇతి శివమ్




సహృదయుల సహకారంతో

ఇప్పటికి

యువభారతి

24 ప్రచురణలను

**1,60,000**

పైచిలుకు ప్రతులను

సరసమైన ధరలకు

అందించగలిగినది.



**7000** కు పైగా

సాహితీ మిత్రులుగాచేరారు

**10,000**

సాహితీ మిత్రులకు

సన్నిహితం కావాలని మాధ్యేయం!

సాహితీ మిత్రులు

భారతీ మిత్రులు

భారతీ భూషణులుగా చేరి

యువభారతి

సాహిత్యోద్యమ నిర్వహణతో

తోడ్పడండి!